




శ్రీ

# సంపూర్ణరామాయణము



(ఆఱంకముల నాటకము.

కాంతామతి, శ్రీకృష్ణరాయబారము, గోపనార

మొదలగు నాటకములు రచియించిన


## బద్దిరెడ్డి కోటీశ్వరరావుగారిచే


రచియింపఁబడినది.


ప్రకటనకర్త.

## కురుకూరి సుబ్బారావు.

సరస్వతీ బుక్కుడిపో.

బెజవాడ, కృష్ణాజిల్లా.

కాకినాడ:

కె. సుబ్బారాయసోదరులచే

స్కేప్ అండ్ కో., లో ముద్రింపఁబడియె.

**1928.**




[వెల 1-4-0.






## ఆంధ్ర నాటకములు.

| | | |
|---|---|---|
| శారదావిజయం | 0 | 12 |
| చంద్రకాంత | 0 | 12 |
| మహానంద | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకం | 1 | 0 |
| రామ రాజ్యోద్వాహము | 1 | 0 |

రామ నారాయణ కవులచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| పాండవ జననము | 0 | 10 |
| పాండవ ప్రవాసము | 0 | 12 |
| పాండవోద్యోగము | 0 | 12 |
| పాండవ విజయము | 0 | 12 |
| పాండవాశ్వమేధము | 0 | 12 |
| సంపూర్ణ భారతము | 1 | 4 |
| సంపూర్ణోత్తర రామాయణం | 1 | 4 |
| ద్రౌపదీ వస్త్రాపహరణం | 1 | 0 |
| సంపూర్ణ శ్రీకృష్ణచరిత్ర | 1 | 0 |
| అహల్యాశాప విమోచనం | 0 | 12 |
| రామదాసు (భక్తిరసం) చక్కని సాంగులు కలవు | 1 | 0 |
| సత్యహరిశ్చంద్ర | 0 | 12 |
| పురూరవ | 0 | 12 |
| కుశలవ | 0 | 12 |
| శ్రీరామవిజయం కో॥ వేం॥ | 0 | 10 |
| లలితా విజయము పో॥ వేం॥ | 1 | 0 |

బద్దిరెడ్డి కోటీశ్వరరావుగారిచే రచియింపఁ బడినవి.

| | | |
|---|---|---|
| సంపూర్ణ రామాయణం | 1 | 4 |
| కాంతామతి | 0 | 12 |
| రోషనార జహ్వారిబాయి | 0 | 12 |
| హనుమద్రామ సంగ్రామం | 0 | 12 |

## ఆంధ్ర నాటకములు.

| | | |
|---|---|---|
| మహానంద | 1 | 0 |
| జయంత జయపాలము | 0 | 12 |
| వైరాగ్యచింతామణి | 1 | 0 |

శనగవరపు రాఘవశాస్త్రి గారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| సంపూర్ణ భాగవతము | 0 | 12 |
| కబీర్ దాసీయము | 0 | 12 |
| ఫాలాఫ్ విజయనగర్ | 0 | 12 |
| కృష్ణదేవరాయవిజయం | 0 | 12 |

జమ్మలమడ్క లక్ష్మీ నరసింహం గారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| శ్రీరామ పట్టాభిషేకం | 1 | 0 |
| విజయ భాస్కరము | 1 | 0 |
| సత్యాబాయి | 0 | 12 |
| సురాజుద్దౌల లేక అసామాన్య | 0 | 8 |
| ప్రభాకర (వేశ్య) | 0 | 8 |

ముత్తనేని వేంకటచెన్న కేశవులుగారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| తులసీదేవి అనుసతీతులసి | 1 | 0 |
| చండిక (భయానకము) | 1 | 0 |

నాటక సరస్వతి కవిగారివి.

| | | |
|---|---|---|
| వరవిక్రయం | 1 | 0 |
| రాధాకృష్ణ | 1 | 0 |
| మధుసేవ | 1 | 0 |
| చిత్రనళీయము | 1 | 0 |
| లవకుశ | 1 | 0 |

ద్రోణంరాజు సీతారామారావు గారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| శ్రీరామ జననము | 0 | 8 |
| శ్రీరామప్రవాసము | 0 | 8 |

వలయువారు :— కురుకూరి సుబ్బారావు,

**సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.**

శ్రీ

# సంపూర్ణరామాయణము.

(ఆఱంకముల నాటకము.)

కాంతామతి, శ్రీకృష్ణరాయబారము, రోషనార మొదలగు నాటకములురచియించిన


## బద్దిరెడ్డి కోటీశ్వరరావుగారిచే

రచియింపఁబడినది.



ప్రకటనకర్త,

**కురుకూరి సుబ్బారావు.**

సరస్వతీ బుక్కుడిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.

ప్రథమముద్రణము 2000

కాకినాడ.

కె. సుబ్బారాయ సోదరులచే స్కేప్ అండు కో., లో

ముద్రింపఁబడియె.

**1928.**




[వెల **1—4—0.**

## ఈ నాటకమునందు వచ్చు పాత్రలు :—

పురుషులు.

శ్రీ మహావిష్ణువు
బ్రహ్మేంద్రాదులు
దశరథుడు
వశిష్ఠుడు
విశ్వామిత్రుడు
శ్రీరాముడు
లక్ష్మణుడు
భరతుడు
శత్రుఘ్నుడు
పరశురాముడు
జనకమహారాజు
సుమంతుడు
గుహుడు
హనుమంతుడు
సుగ్రీవుడు
వాలి
అంగదుడు
సుషేణుడు
జటాయువు
రావణుడు
ఇంద్రజిత్తు
విభీషణుడు
మారీచుడు
అగ్ని
కొందఱు రాక్షసులు

స్త్రీలు.

భూదేవి
సీత
మండోదరి
త్రిజట
హావిర్జట
రక్తాక్షి
తారక
తార - సుగ్రీవుని భార్య



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సంపూర్ణరామాయణము

## ప్రథమాంకము

ప్రథమదృశ్యము—క్షీరసాగరము.

[సముద్రమునకు దూరముగ బ్రహ్మాది దేవతలు ప్రవేశము.]

అందరు— (అనుబంధము.)

(ప్రార్థనానంతరము, లక్ష్మీద్వితీయుఁడైన విష్ణువు శేషతల్పుఁడై సముద్రమునఁ బ్రత్యక్షమగును.)

అందరు—హే లక్ష్మీనారాయణా! మాంపాహి. మాంపాహి.

విష్ణు—బ్రహ్మాది దేవతలారా! మీరు వచ్చిన కారణమేమి?

ఇంద్రుఁడు—హే రమారమణా! ఆర్తత్రాణపరాయణా! నారాయణా!

సీ॥ దిక్కులేలిన మేము । దిక్కులేకున్నాము
పక్షిరాడ్వాహనా । పాహిపాహి

యముడు— యమలోకపరిపాల । నము దూరమయ్యెను
కరిరాజపోషణా । శరణుశరణు

ఋషులు— మునిలోకమున నగ్ని । కణములు జెలరేగ
భక్తచింతామణీ । పాహిపాహి

భూదేవి— భూభారమునకు నేను । మోయఁగాజాలను
నాథ! శ్రీలక్ష్మీశ । నాథ! శరణు

బ్రహ్మ—గీ॥ సర్వమయ! సర్వలోకేశ! । సర్వసాక్షి
నీలవర్ణ! నిరంజనా! । నిర్వికార

యాపదోద్ధార! మా మొఱ లాలకించి
యభయ మొసఁగుము దైత్యుల నడఁపఁదండ్రి!

జనకా! ధరాతలమునఁ బులస్త్యకుమారుఁడగు రావణుఁ డస్మదీయ వర ప్రభావగర్వంబున జగత్త్రయము జయించి పాపభీతిలేక సంచరింపుచున్నాఁడు. వాని మూలమున లోకాలోకములు బెగ్గడిలుచున్నవి. భూదేవి భూభారమును సహింపలేక, దేవతలు తలయెత్తి తిరుగలేక, ఋషులు తపస్సమాధులయందు నిలువలేక, నిదే నిన్నర్థింపుచున్నారు. జారచోర దురాచారములు వానిసొమ్ము. అతండు మనుజునివలనఁ జచ్చునట్లు విధించితిని. నీవాలోకకంటకుని గీటడఁగింపకున్న నింక గత్యంతరములేదు. తండ్రీ! భూభార నివారణార్థము నీ వవతరించినఁగాని, భువనత్రయమునకు శాంతిలేదు.

విష్ణు—బ్రహ్మాది దేవతలారా! తొల్లి కశ్యపమహర్షి, నన్నుఁ దనకు మారునిగ జన్మించుమని ప్రార్థించెను. అతఁడే యిప్పు డయోధ్యానగరమున దశరథుం డను పేర రాజ్యమేలుచున్నాఁడు. నేనింక వానికిఁ బుత్రుండనై పుట్టెదను. యోగమాయ సీత యను పేర నయోనిజయై జనకభూపాలునకుఁ బుత్రిక గాఁగలదు. తన్మూలమున.

(అనుబంధము) [అంతర్ధానమగును.]

అందరు—ధన్యోస్మి. ధన్యోస్మి. (అందఱు నిష్క్రమింతురు.)

---

ద్వితీయ దృశ్యము—అయోధ్యానగర కొలువుకూటము.

[ఉచితాసనముల దశరథుఁడు, వశిష్ఠుడు కూర్చుండియుందురు]

దశ—గురూత్తమా! పుత్రకామేష్టియాగమువలన, నాలుగు వేదములో యన నలువురుపుత్రులనుబడసితిని. మీకృపావలోకనమునఁ బుత్రులు విద్యాబుద్ధులం దసమానులై యున్నారు. పెద్దవాఁడనగుటచే వారి వివాహమహోత్సవముఁగూడ గన్నులారఁజూచి యానందించుకాల మెప్పుడాయని యువ్విళ్లూరుచుంటినిగదా?

వశి—రాజా! కొలదికాలములో నీయభీష్టమట్లే నెఱవేఱుఁగాక.

దశ—వశిష్ఠమునీంద్రా! నీయనుగ్రహమున్న నాకేది కొదువ?

సేవకుఁడు—(ప్రవేశించి) మహారాజా! విశ్వామిత్ర మునీంద్రులవారు దయచేసియున్నారు. ఏమియాజ్ఞ?

దశ—ఓరీ! సత్వరము దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము (నిష్క్రమించును.)

విశ్వామిత్రుడు—(ప్రవేశము.)

దశ—(ఎదురేగి) మహర్షితిలకా! వందనము. ఈయున్న తాసనమలంకరింపుడు.

(అనుబంధము.)

విశ్వా—(కూర్చుండి) రాజేంద్రా! సబాంధవముగ నీకుఁ గుశలమే గదా?

దశ—గాధినందనా! మీదయవలనఁ గుశలమే. దేవా! మీహోమజపాధ్వరాదులు నిర్విఘ్నముగ నెఱవేఱుచున్నవి గదా?

విశ్వా—దశరథేశ్వరా! ఏమని చెప్పవలయునో తెలియకున్నది.

దశ—అట్లనుచుంటి రేమి?

గీ॥ ఆర్య! భవదీయ హోమజ । పాధ్వరాదు
లేలకొనసాగకున్నవి? । యెవరువిఘ్న
కారకులో చెప్పుఁడు వారి । కంఠలోలుకు
భూరితేజోజ్వల దివ్యత । పోధనాఢ్య!॥

మీరు విచారింపవలదు. మీయభిమత మీడేర్చెదను. కోరినట్లు నొసంగెదను. కారణమేమో యెఱిఁగింపుడు.

విశ్వా—రాజేంద్రా! గొప్ప యుపద్రవమేమిలేదు. కాని, నేనొక యాగముఁ జేయఁదలపెట్టితిని. కొందఱు రాక్షసు లా యజ్ఞమునకు విఘ్నమొనరింప వేచియున్నారు. కావున, యాగసంరక్షణార్థమై నీకుమారులగు రామలక్ష్మణులను నావెంటఁ బంపించితివేని, యజ్ఞము నిర్విఘ్నముగఁ గొనసాగించుకొని, వెండియు నీబిడ్డలను నీకప్పగించిపోయెదను.

దశ—(ఆశ్చర్యముతో) ఏమి! రామలక్ష్మణులనా?

విశ్వా—అవును.

దశ—మహాత్మా! మీరునన్నుఁ బరిహసించుటలేదుగదా?

విశ్వా—రాజా! పరిహాసముగాదు. నీకుమారద్వయమును నావెంటఁ బంపవలసినదని చెప్పుచున్నాను.

దశ—మునికులతిలకా! మీనుడు లత్యాశ్చర్యము. మీకోరిక దురవగాహము. ఏమింటిరేని.

సీ॥ ఒకచెంపనెత్తుటి । నొకచెంపఁ బాలును
కొట్టఁగాఁ గారెడి । కుఱ్ఱవాఁడు
శృతిమించి కేరెడి । శుకపికధ్వనులకే
భీతిల్లి పోయెడి । పిన్నవాఁడు
పూఁదోట సంచార । మున నసుస్వరంబును
నేఁడు దీర్చుకొనెడి । చిన్నవాఁడు
పలికింపఁగా ముద్దు । పచ్చలారని కడుఁ
గసిగందులైన నా । కన్నవాఁడు
గీ॥ భయదకీలాగ్ని శస్త్రముల్ । పట్టఁగలఁడ?
క్రూరదైత్యాన్వయంబును । గూల్చఁగలఁడ?
బాలుఁడేడ? మఖంబుఁగా । పాడుటేడ?
దశరథుఁడు లేడ? చక్కనే । తపసిఱేడ!॥

ఆ దుష్టరాక్షసులెవరు ?

విశ్వా—దశరథా! ఆ నిశాచరులు మారీచ సుబాహులు రావణుని పంపున మిమ్ము మన్నింపఁగక వర్తింపుచున్నారు. ఆ దురాత్ములు శ్రీరామలక్ష్మణుల శౌర్యము శరాగ్నులఁగాని దహింపఁబడరు. కుమారులు పిన్నవారనెడి వెఱ్ఱిమాలాపన మిండఁ గట్టిఁబెట్టి నావెంటఁ బంపుము. శుభములు వడయఁగలరు.

దశ—(భయాశ్చర్యదుఃఖములతో) దేవా! ఇదియొట్టికోరిక (అనుబంధముI)

గీ॥ విలయకాలాగ్ని పొడుగు నా । మీఁదఁబడిన
వార్ధులుప్పొంగి నను ముంప । వచ్చియున్న
నోర్చెదను; రాముని నెడబాసి । యున్న నిముస
మొక్క యుగమౌట, నెడబాయు । కోర్వఁగలనే? ॥

లోకవిద్రావణుఁడగు రావణుని పనుపున విహరించుచున్న రక్కసుల నుక్కడంప మానవమాత్రులకే గాదుగదా? బ్రహ్మేంద్రాదులకైనఁ దరమా? భండనమున కోదండపాణులై, దండితారాతికండలఁ జెండాడ నాపసికూనలకుఁ దరమా? ఈపట్ల నన్ను క్షమింపవలెను.

విశ్వా—అసత్యవాదీ! అర్కవంశోద్భవుండవై రాజరాజేంద్రుఁడవై, మావంటి ఋషీశ్వరుల కభయమిచ్చి వెనుకాడుచుంటివా? (అనుబంధము)

గీ. సత్యసంధునివో లెన్న । సత్కరించి
అడిగినది యిచ్చువాఁడ నం । చభయ మొసఁగి
యనృత మాడంగఁదగునె? స్వ । ల్పాంశమునకు
బుట్టఁబోఁడిక నీవంటి । భూవిభుండు॥

ఛీ! ఛీ! సూర్యకులమునకుఁ గళంకముఁ దెచ్చిన నీముఖావలోకనము మావంటి వారికి కళంకమునుమా! నీకులగురుని ప్రబోధమిదియే కాబోలును! ఓవసిష్ఠా! పాపభూయిష్ఠా! నీవు దుర్వృత్తిచేఁ బొట్టఁబోసికొనువాఁడవు గనుకనే, శిష్యునిగూడ నీయంతవానిగఁ జేసి కులుకుచున్నావు, లేదేని, నీవయిన మందలించి మదభీష్టంబు నెఱవేర్చకుందువా ద్రోహీ!

వసి—(స్వగతము) "ఉలుముత్తెము మంగలముమీఁదఁబడి" నట్లున్నది వీనికోపము. నేనిప్పుడు వీనితో వాగ్వాదమునకుఁ బూనుకొంటినేని కార్యభంగమగును. రామలక్ష్మణులను వీనివెంట బంపుటె ముఖ్యకర్తవ్యము. (ప్రకాశముగ) రాజేంద్రా! ఆడితప్పుటన్నది దోషమేగాక, సుక్షత్రియవంశమునకొక మచ్చఁగల్పించినవాఁడవగుదువు. కావున, రామలక్ష్మణులు బాలురని శంకపక, వీనివెంటఁబంపుము. ఇతం డఖిలాస్త్రశస్త్రవేది. మహామహిమాన్విత కీర్తి విస్తారుఁడు. వీనిమూలమునఁ గుమారు లపారధనుర్వేదపారంగతులై, యశఃకాములై, వీరవిజయహస్త్యశ్వులై శుభములు వడయఁగలరు. విచారముడిగి, నాయాజ్ఞఁ బాలింపుము.

దశ—గురువర్యా! మీరు లోకజ్ఞులు, మీయాజ్ఞ శిరమున ధరించితిని. (విశ్వామిత్రునితో) మునిచంద్రమా! లేక లేకఁ గలిగిన సుకుమారులగుటచేతను, పసిబాలురగుటచేతను, పుత్రవాత్సల్యముచేతను, వెనుకాడిన నాయపరాధము మన్నింపవలయును. నా తనయుల నిదే మీవెంటఁబంపించెదను. సేవకా! నాయాజ్ఞగా రామలక్ష్మణులను తోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము. (లోనికేగి రామలక్ష్మణులతో బ్రవేశము.)

రామలక్ష్మణులు—జనకా! వందనము. గురూత్తమా! నమస్కారము.

దశ—వసి—కల్యాణమస్తు.

దశ—కుమారులారా! విశ్వామిత్ర మహర్షికి నమస్కరింపుఁడు.

రామలక్ష్మణులు—మునీంద్రా! వందనములు.

విశ్వా—కల్యాణమస్తు.

దశ—మునికులోత్తమా!

గీ॥ బిడ్డలేపోక, నరువది । వేలయేండ్లు
కవల హరికృపచేఁగంటి । నాత్మజులను
పుత్రవాత్సల్యమున నేను । బొగిలకుండఁ
ద్వరగఁ దోడ్కొనిరమ్ము పు । త్రులఁగొమ్ము॥

(వారికప్పగించును.)

విశ్వా—రాజేంద్రా! నీవుమాత్రముఁ జింతింపవలదు. కుమారు లఖండవిజయశంఖారవంబులతోఁ బెండ్లికుమారులవలెవచ్చి, నిన్నానందవారధినోలలాడింపఁగలరు.

దశ—చిత్తము. బిడ్డలారా! మీరీమహర్షిసత్తమునితోఁబోయి యాగసమాప్తిఁ జేసి వెంటనేరండు.

రామలక్ష్మణులు—చిత్తము. (వసిష్ఠునకు, దశరథునకు నమస్కరింతురు.)

దశ—వసి—శుభమస్తు.

దశ—నాయనలారా! మిమ్ముఁ గొంతదూరము సాగనంపవచ్చెద పోవుదమురండు. మహాత్ములారా! దయచేయుఁడు. (మునులవెంటనే దశరథుఁడు, బిడ్డలతో నిష్క్రమించును.)



### తృతీయప్రవేశము—అరణ్యము.

—విశ్వామిత్ర, రామ, లక్ష్మణులుప్రవేశము.—

రాము—దేవా! మనమిప్పుడు గంగానదిని దాటి వచ్చితిమిగదా! గమ్యస్థలమింకెంతదూరమున్నది?

విశ్వా—రామా! ఈభీకరారణ్యమే గమ్యస్థలము.

లక్ష్మ—మహాత్మా! మదగజశరభశార్దూల గండభేరుండ ఖడ్గకంఠీరవగవయ వరాహ మహిషమహోరగాది సంయుతంబగు నిమ్మహాటవి చూపరులగుండె లవియఁజేయునుగదా?

రాము—మునీంద్రా! దురవలోక్యమై, దుర్గమోగ్రమై, దురవగాహమై, దుష్టమృగసంకులంబైన నీవనమిట్లుండుట కేమికారణము?

విశ్వా—రామలక్ష్మణులారా! ఈప్రదేశము తొల్లి కరూశదేశమని పిలువఁబడు
చుండెడిది. తాటకియను దుష్టరక్కసి, మారీచసుబాహులను పుత్త్రులఁగూ
డి, దేశమంతయు నాశనముఁజేసియున్నకతన, నాఁటినుండి నేఁటివఱకిట్లరణ్య
ముగనున్నది. దీని సమీపమందే యారక్కసి నివసించుచుండును. దాని
నే మీరిప్పుడు వధింపవలసియున్నది.

లక్ష్మ—దేవా! ఏమంటిరి?

గీ॥ క్షాత్త్రముగఁ గేలశస్త్ర । శస్త్రములఁబట్టి
యబలఁజంపునె? సుక్షత్త్రి । యాన్వయుఁడు

రాము— స్త్రీనిఁజంపుటవివేకమే? । సిగ్గుగాదె?
పాతకముగాదె? దుర్గతిఁ । బడయవలదె?.

విశ్వా—శిష్యులారా! మీపలుకులు సత్యమె. కాని, లోకోపకారార్థము లోకకంటకియ
గు రక్కసి నుక్కడంచుట ధర్మేతరముఁ గాదు. మీరీవిషయమున సంశ
యింపక నాయాజ్ఞఁ బాలింపుఁడు.

రాము—లక్ష్మ—చిత్తము.

విశ్వా—నాయనలారా? మీరింక ధనుష్టంకారముఁగావింపుఁడు. ఘుంఘుమాక్రాం
తమగు ధ్వని నాకర్ణించినంత నాదానవి మిమ్ముఁ జూడవచ్చును.

రాము—మీయాజ్ఞఁబాలించెదము. ఇదే ధనుష్టంకారము సేయుచున్నాము.
(ఇరువురు నారులు మ్రోగింతురు.)

తాటకి—(ప్రవేశించి మహాకోపముతో) అరే! దురాత్ములారా! శివశివా! నావన
మున నారులు మ్రోగించి, మృత్యువును వెంటఁగొని తెచ్చుకొనిన మీర
లెవ్వరురా? (మీఁది కురుకును.)

లక్ష్మ—అన్నా? ఏమీ వికృతాకారము?

రాము—తమ్ముఁడా! దీనిఁజూచిన జగత్త్రయమైన వడఁకునుగదా?

విశ్వా—రామా! రామా; ఆలసింపకు. శరముఁబ్రయోగింపుము.

రాము—చిత్తము. (బాణము సంధింపుచుండును.)

తాటకి—(అనుబంధము 3) (మీఁదికేగును.)

రాము—దుర్మతీ! ఇదేవచ్చితివి. (బాణము విడుచును,)

తాటకి—హా! హా! (అని నేలఁగూలును.)

విశ్వా—రామచంద్రా! ఇది నేలఁగూలినది. ఇంక భయములేదు.

రాము—మునిచంద్రా! మీ యాగమింక నిర్విఘ్నముగ జేసికొనవచ్చునుగదా ?

విశ్వా—రామా! దీనితో నైనదా? దీనికి మారులగు మారీచసుబాహులున్నారు. వారుఁగూడ మడిసినఁగాని యాగము పూర్తికాదు. కొలఁదిసేపటికి వా దురాత్ములుఁగూడ రావచ్చును.

రాము—రానిండు. చెరియొక మార్గణమున శిక్షగావించెద.

లక్ష్మ—అయ్యలారా! భగవానుఁడు పశ్చిమసముద్రమునఁ గ్రుంకుచున్నాఁడు. సంధ్యానుష్ఠానములను దీర్చుకొనివచ్చిన బాగుండునుగదా!

విశ్వా—అట్టులే యొనర్చెదము. రామభద్రా! నావద్ద నభేద్యములగు దివ్యాస్త్రశస్త్రము లనేకములుగలవు. అవన్నియు నీకొసంగెద. ఆ కనఁబడు నదీతీరమునకుఁ బోవుదమురమ్ము. నీవందు సుస్నాతుఁడవై పరిగ్రహింపవలయును. రండు పోవుదము.

రాము—చిత్తము. (అందఱు నడచుచుందురు. రాముని పదస్పర్శవలన పాషాణ మహల్యయగును.) దేవా! ఏమీయద్భుతము?

విశ్వా—కౌసలేయా! ఈమె గౌతమఋషిభార్య. అహల్యాదేవి.

అహ—(చేతులు మోడ్చి) హే రామచంద్రా! పతిశాపవశమునఁ బాషాణమై యనేకవేలసంవత్సరములనుండి పడియుంటిని. నేఁడు మీపదస్పర్శభాగ్యమున శాపవిముక్తయైనది. నీచరణసరోజములకివే సహస్రవందనములు.

రాము—సాధ్వీశిరోమణీ! ఇంక నీభర్తను గూడి సుఖింపుము.

అహ—విశ్వామిత్రమహర్షీ! వందనములు. పతినన్వేషింప నరుగుదును.

విశ్వా—అమ్మా! చింతింపకుము. మా వెంటరమ్ము, నిన్ను నీభర్త సన్నిధానమునకుఁ జేర్చు మార్గముఁ జూపించెద. (నడచుచుందురు.)

అహ—చిత్తము. (అందరు నిష్క్రమింతురు.)



చతుర్థదృశ్యము. జనకునియాస్థానము.

[విదేశరాజబృందముతో జనకుఁడు సింహాసనాసీనుఁడై యుండును, రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నున్నతాసనములఁ గూర్చుండియుందురు]

రావణుఁడు—(లేచి నిలువఁబడి) జనకరాజేంద్రా! మహేశ్వరుని విల్లు విఱువ మనుజేంద్రు లసమర్థులు. శివభక్తాగ్రగణ్యుఁడు లంకాధినాథుఁడు సమస్తసురాసుర

జన—(సీతతో) కుమారీరత్నమా ! పుష్పదామము నీరాజకుమారుని గళమున నలంకరింపుము.

సీత—(రాముని స్కంధమున పుష్పమాలవైచి తలవాల్చి నిలువఁబడును)

(అందరు జయజయధ్వానములు సేయుదురు)

జన—మహాత్మా ! అవతారపురుషుఁడగు శ్రీరామచంద్రుని నల్లునిఁగఁ బడయుటచే నెంతయు ధన్యుఁడనైతిని. వెంటనే దశరథేశ్వరునకు శుభలేఖ వ్రాయించి వివాహప్రయత్నము నొనరించెదను. లోనికేగుటకు దయచేయుఁడు. (సీతతో జనకుఁడు లోనికేగును)

విశ్వా—మంచిది. రామలక్ష్మణులారా ! పోవుదముగాక. (వారిని వెంటనిడుకొని లోనికేగుదురు)

—○—

పంచమదృశ్యము—అరణ్యమార్గము.

[రథారూఢులై రామలక్ష్మణ దశరథ వసిష్ఠాదులు ప్రవేశము]

(తెరలో)

ఓ క్షత్రియసంభూతులారా ! అయోధ్యానగరవాసులారా ! శివధనుస్సువిఱిచిన దశరథాత్మజుఁ డెందున్నవాఁడు ?

దశ—(భయభ్రాంతుఁడై) భువనభీకరుఁడగు భృగురాముఁడు క్రోధకీలాకలితుండై యిదె వచ్చుచున్నాఁడు? శివధనుర్భంగమునకు కోపోద్దీపితుఁడై మమ్మేమి సేయునో గదా ?

వసి—రాజేంద్రా ! భయపడవలదు. పరశురామ విక్రమాటోపదవానలుండగు మన రాముండు లేఁడా ?

లక్ష్మ—జనకా ! అతండు క్షత్రియాంతకుఁడని కదా ! భయపడుచుంటివి.

గీ॥ రాక్షస విరాముఁడగు రఘు । రాముఁడుండ
పరశురామునిఁగని భయ । పడఁగనేల ?

రాము—జనకా ! కులగురువులగు వసిష్ఠమునీంద్రుల కరుణావలోకనము, విశ్వామిత్ర దయావిశేష మపారముగనున్నప్పుడు

గీ॥ భార్గవుఁడె కాదు, ముక్కంటి । వచ్చియున్నఁ
బోరి, జయలక్ష్మిఁ బడసెదఁ । బొగలకయ్య !॥

(పరశురాముఁడు పరశువుఁబూని ప్రవేశము)

పర—మదోన్మత్త క్షత్త్రియహతకులారా ?

చ॥ మఱచెన? రాజవంశముల । మారణఁజేసిన మాకుఠారమున్
మఱచెన ? గర్వచిత్తుఁడయి । వీరముఁజూపఁ బురారిచాపమున్
నెఱవకఁజేసినట్టి రఘు । వీరుని రాముని ఖడ్గపాణి నీ
పఱశువుచేతఁ గూల్చి, యిన । వంశము ధ్వంసముఁజేతుఁ జూడుఁడీ॥

హరధనుర్భంగవిజయగర్వాంధకారసంచారపరాయణుఁ డగు రాముఁ డెందున్న వాఁడు ?

రాము—(నిర్భీతితో) లోకైక వీరవిజయభార్గవ భగవానునకు రాముఁడిదే నమస్కరించుచున్నాఁడు.

పర—ఏమి నీవా రాముఁడవు? ఓరీ ! మనుకులపవిత్రసూతీ !

ఉ॥ ధీరుని గార్తవీర్యుని వ । ధించియు; నిర్వది యొక్కమాఱు వే
ర్వేరుగ నేటియేటి పృథి । వీశులఁబట్టి పరశ్వధంబుతో
జీరిన వానికంఠమున । జీవములుండఁగ నెగ్గుఁజేసి నా
వార ! పినాకమున్ విఱచి । యల్పునిఁజేసితె త్ర్యంబకేయునిన్॥

శివశిష్యుఁ డఖిలాస్త్ర శస్త్రములు సన్యసించియు, గురుధనుర్భంగ వ్యళీకమువలన వెండియు శత్రుశేషము నిర్మూలింప వచ్చియున్నాఁడు. ఇంక నీమగంటిమిఁ జూపి సమరవిజయివి కమ్ము.

రామ—మీయాశీర్వచన మమోఘమగుఁగాక. మహానుభావా ! భవదీయ గురుచాపము నాకరస్పర్శమాత్రమున విఱిఁగినదిగాని, నేఁజేసిన దేమియులేదు.

పర—ఓరీ ! కపటీ ! అటులయిన పరశువువలన ప్రతిఫల మనుభవింపుము.

రాము—దేవా ! జన్నిగట్టులపై నిక్ష్వాకువంశజులు కత్తిఁ గట్టఁజాలరు.

పర—ఏమంటివి ? సమస్త రాజరక్తప్రవాహముల నీధరావలయము నీ రేణుకం జేసిన పరశురాముఁడు వట్టి పాఱుఁడని తలంచితివిగా ?

రాము—అట్లనుకొనలేదు. నీవు నీతల్లినిఁజంపి, భూమి నిరేణుకంజేసితివని తలంచితిని.

పర—ఓయవివేకీ !



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సంపూర్ణ రామాయణము

## ద్వితీయాంకము

### ప్రథమదృశ్యము—కైకమందిరము.

[కైక, మంథర ప్రవేశము.]

కైక—మంథరా! నీ వింతవరకు నెక్కడ నుంటివే?

మంథ—ఎక్కడ నుంటే నేమి? నట్టింటనున్నాను.

కైక—అదేమే! నీ కంత కష్ట మేమువచ్చినది?

మంథ—ఏదో కొంతవరకు కష్టమైన దుఃఖపడనేల? నేటి దినము నీకెక్కడమారినదాన నగుదునని కలనైనను దలంపనైతిని.

కైక—చెలీ! కేకయరాజపుత్రి పరరక్షితనగు నీ వేల దిక్కులేనిదానవైతివే?

మంథ—బాగున్నది. ముందు నీగతి తెన్నుగానున్నదా? “[illegible] రాముని నభిషిక్తుని జేసెదరని” చెప్పుచున్నది.

కైక—మంథరా! అట్లంటివేమే! నీకేమైన మతిభ్రమించినదాయెనా? నాకేమి? దుర్గతి సంభవించు టేమి?

మంథ—నీవు దశరథరాజేంద్రుని ప్రాణాధిక వగుట నింతకాలము, స్వేచ్ఛగ విహరించితివి. ఇంకేమున్నది? నీటనుండి వెలువడిన చేపగతి సంప్రాప్తమయినది?

కైక—ఓసీ! ఇప్పుడు నీకేమిముప్పు వాటిల్లినది? నావలన నీకేమైన ననాదరణ గలిగెనా?

మంథ—నీవు చేయలేదు. చేయుచున్నారు.

కైక—చేయున దెవ్వరు? చేసెడిదేమి?

మంథ—చేయునది రామపట్టాభిషేకము. ఇఁకఁ జేయఁబోవునది దాసీత్వము.

కైక—(సంతోషముతో) ఏమే! నా శ్రీరామచంద్రుని పట్టాభిషేకమహోత్సవమా? ఆహా! నేఁడెంత సుదినము. నీవీ శుభవార్తఁ దెచ్చినందులకు ముక్తాహారము గ్రహింపుము. (తన మెడనున్న హారము మీయఁబోవును.)

మంథ—వలదు. వలదు. అది నీయొద్దనే యుండనిమ్ము.

కైక—సంతోషసమయమున పారితోషికము నిరాకరించెద వేమే?

మంథ—గంపెడు దుఃఖ మంధకారమై నన్నావరించుచున్నను, విచారింపక సంతోషింపుచున్న నిన్నుఁ జూచి పారితోషికముఁ బుచ్చుకొనలేకపోయితిని.

కైక—ఓసీ! మందమతీ! రామపట్టాభిషేకసమయమున నాకు దుఃఖమేమిటే? నీకేమైన మతి చలించెనా?

మంథ—నాకేమియు మతిభ్రమణ కలుగలేదు. నేఁటితో నీ రాజ్ఞీత్వమునకుఁ దిలోదకములు విడువవలయును గదా? ఏమనిన, శ్రీరామపట్టాభిషేకమే కారణము. రాముఁడు పట్టభద్రుఁడైన మరుదినమునుండి, నీసవతి కౌసల్యకు రాజమాతృత్వభాగ్యోదయమైనట్లే గదా? ఇంక, నీవామె సేవకురాలవు. నీకుమారుఁడగు భరతుఁడు రామునకు భృత్యుఁడు. ఏమ్మా గా కింకేమున్నదమ్మా! దశరథుఁడు నీగీచినగీత దాఁటఁడని మురిసిపడితివిగదమ్మా! ఎంతమాయకాడమ్మా! నీమీఁద లేనినెనరుఁ జూపి, చిట్టచివరకు ముసలి కౌసల్యను పెద్దఁజేసి, నీకు గొంతుకోఁత దెచ్చినాఁడుగదమ్మా! నీపతికి నీయందనురాగమే శాశ్వతమైన నీకుమారుని పట్టభద్రునిఁ జేయకుండునా? ఏమి చేసెదవు? నీకర్మమిట్లు కాలిపోయినదమ్మా!

కైక—మంథరా! నీవు నా శ్రేయముఁ గోరుదాన నగుట నిజమే వచించితివి. రామపట్టాభిషేకానంతరము నాపతి నామోమైనఁ జూడఁడు.

మంథ—నిజము. కౌసల్యాదేవికి మాత్ర మూడిగము సేయవలదా?

కైక—హా! హతభాగ్యనుగదా!

మంథ—అంతేకాదు. ఇంక మీజీవితమే దుఃఖభాజనము.

కైక—మంథరా! ఇంకనాగతియేమి? నేనీ పరాభవాగ్నిఁబడి దహింపఁబడవలసినదేనా? నాకుమారుని జీవితానందచంద్రిక యస్తమింపవలసినదేనా? అయ్యో! తరుణోపాయములేదా?

మంథ——నేనదే యోచించుచున్నాను.

కైక——నిరాధారజీవితమునకు మరణమే శరణ్యముగదా!

మంథ——కైకేయీ! తొందరపడకుము. రేపుగదా పట్టాభిషేకము. కొలదిసేపటికి నీనాథుండు నిన్ను సందర్శింపవచ్చును. ఏదేని యుపాయ మాలోచించి నాథునిం బ్రసన్నుని జేసికొనుము. చేటికలకు నీపతి నీవలలోఁ జిక్కి యుండును. యోచింపుము.

కైక——అయ్యో! నాకింత యదృష్టమా!

మంథ——అదృష్టదేవత నీయందు మూర్తీభవించి యున్నది. ప్రయత్నముచే నెంతటి కార్యమైన సాధ్యమగును.

కైక——మంథరా! నీమేలు మఱవను. నీవే యేదైన నుపాయముం జెప్పి నన్నుద్ధరింపుము. నీకంటె నా కాప్తులు లేరుగదా?

మంథ——(యోచించి) కైకేయీ! చెప్పెదవినుము. తొల్లి శంబరాసురయుద్ధంబున, నీనాథుండు నీకు రెండువరము లిచ్చియుండెనుగదా!

కైక——అవును. అయిన ;

మంథ——నీవిప్పుడా వరములు జ్ఞప్తికిఁ దెచ్చి, యొకవరమున భరతుని రాజుగాఁ జేయవలసి నదని చెప్పుము.

కైక——బహుబాగుగ మంథరా! విషమావస్థయం దనుకూలముగ బోధించిన నీకిదే బహుమానము. (ఆహార మొసంగును)

మంథ——(పుచ్చుకొని) అంతయు నీదయావిశేషమే గదా!

కైక——మంథరా! ఒకమాట. రాజేంద్రుఁడిందులకు సమ్మతించునే యనుకొనుము. రాముఁడీపురమున స్థిరుఁడై భరతునకేదేని యపకృతి సేయఁడుగదా?

మంథ——అవును. అదియును విచారింపవలసినదే. దానికొకయుపాయముం జెప్పెద వినుము. రెండవవరము, పదునాలుగేండ్లు రాముఁడరణ్యవాసము సేయునట్లు కోరుకొనుము. పితృవాక్యపరిపాలనార్థమై రాముఁడడవికేగుట నిజము. పిమ్మట భరతరాజ్యము వర్ధిల్లఁగలదు.

కైక——మంథరా! బలేయుక్తి వెదకితివే! నిరాటంకముగ రాజ్యశ్రీల ననుభవింపఁ గలను. కాని, నీవు నావెనువెంటనే యుండవలయునుసుమా?

మంథ——అట్లేయుండెదను. కాని, నీవు నీభర్త వచ్చుసరికి, యలంకారరహితవై శూన్యమందిరమునఁ బవ్వళించి యుండుము. రాజేంద్రుఁడు వచ్చినవెను

క నీ యావచ్ఛక్తి నుపయోగించి, దానినోటనుండి వరము వచ్చునటుల పలికించి, పిమ్మట కర్తవ్యమునకుఁ గడంగుము. నేఁబోయివచ్చెద.

కైక—పోమ్మా. నేను నాపనిమీఁదనుండెద. (ఇరువురు నిష్క్రమింతురు.)

---

ద్వితీయదృశ్యము—అంతఃపురము.

[ముసుఁగువెట్టుకొని కైక పరుండియుండును—దశరథుఁడు ప్రవేశము.]

దశ—(దిశలు బరికించి) ఔరా! ఏమియాశ్చర్యము. కేకయరాజపుత్రి విశ్రాంతాగారమున నేఁ డుండదేమి చెప్పుమా?

సీ॥ సారంగనేత్రి! మేల్ । శయ్యాతలముఁ బాసి
ముసుఁగిడి, నేలపైఁ । బొరలనేల ?
పుష్పావతీ! పట్టు । పుట్టంబు గొల్లకఁ
గడఁజీర్ణచేలంబు । గట్టనేల ?
కేకయరాజపుత్రి! । క్రొమ్ముడి విదళించి
క్రొవ్విరుల్ నేలపైఁ । గొట్టనేల ?
చంద్రాక్షి! మణిమయ । స్థగితభూషణములు
మేన్ ధరింపకఁ బార । వేయనేల ?
గీ॥ ఇందుముఖి! నాదుజీవితా । నందదీప్తి
ముసుఁగు దొలఁగించి, నాయందు । దోసగులున్న
దెలుపము సేయరాదె ? దా । నుండఁగానె ?
కరుణఁజూడవె! కావవే! । కౌఁగిలియవె! ॥

(ముసుఁగుఁదీయఁబోవును)

కైక—(విదలించుకొని లేచి ముందుకువచ్చి) చాలుఁ జాలు. అవలఁబొమ్ము.

దశ—దేవీ! నావలనగలిగిన యపరాధమేమి? [అనుబంధము 6]

[అనుబంధము 7]

కైక—అబలనగుట, నీకపటానురాగపాశబంధిత్వమే యపరాధమునకు గారణము.

దశ—ప్రియసీ! అకారణముగ నన్నేల దూరెదవు ?

కైక—అవును. నిన్ను దూఱుట నాదే లోపము.

దశ—కైకేయీ! నీవలన లోపముఁగలిగనని నేఁజెలుకఁగలనా? ఏల యీనిష్ఠురోక్తులు. కారణముఁ దెలుపరాదా?

కైక—కారణమా? పట్టంపురాణియగు నీకౌసల్యాదేవితో మంతనములాడుచు, రామపట్టాభిషేకోత్సవమున లగ్నమైయున్నవాని కొక కారణముఁగావల యునా? ఈకైకేయి యేమూలఁబడి చచ్చిననేమి?

దశ—ప్రాణేశ్వరీ! నిష్కారణముగ నల్లీలములాడుకొని నన్నుఁగలఁగ వెట్టనవేల? నావలన నీకేమిలోపముఁగలిగెనదో నదింపుము. నాప్రాణమైన నర్పించెదను.

కైక—తొల్లి నాకిచ్చెదనని వాగ్దానముఁజేసిన వానిని నిచ్చినంజాలు. మఱియొండవ సరములేదు.

దశ—నేఁజేసిన వాగ్దత్తమేమి?

కైక—అదియుఁగూడ జ్ఞప్తిలేదా?

దశ—నిజముగ జ్ఞప్తిచాలదు. నీవు చెప్పఁగూడదా?

కైక—మంచిది. చెప్పెదవినుము. తొల్లి శంబరాసురయుద్ధంబున, రెండు వరములు మీరు నాకిచ్చియుంటిరి. నిజమేగదా:

దశ—అవును.

కైక—ఇప్పుడా రెండువరములు నాకు దయచేయవలయును.

దశ—అబలా! ఇంతమాత్రమునకింత రాద్ధాంతమేల? అట్లే యిచ్చెదను. కోరుకొనుము.

కైక—ఆడితప్పవుగదా?

దశ—అర్కవంశజు లన్నృతవాదులుగారని యెఱుంగవా?

కైక—అవును. చెప్పెదవినుము. మొదటివరము నాకుమారుఁడగు భరతుని పట్టాభిషేకము. రెండవవరము రాముఁడు పదునాలుగేండ్లరణ్యవాసముఁ జేయుట.

దశ—(గుండెబాదుకొనుచు) ఆ! కైకా! కైకా! ఏమంటివి?

కైక—భరతునకు పట్టాభిషేకము. రామునకరణ్యవాసము.

దశ—హా! రామా! రామా! (మూర్ఛిల్లి లేచి) ఓసీ! పాపిసీ! రాచకులవంశ నాశనీ! ఎంతద్రోహముఁ దలపెట్టితివే? ఎంతమాయ బన్నితివే?

ఉ. చక్కనిచుక్కనంచు మన । సానినఁగోరి వివాహమాడి పెం
మక్కువఁజూపినందులకు । మాయురె! క్షణకాలసర్పమై

గ్రక్కితివా! విషాగ్ని; చిర । కాలపరివర్ధిత వంశవృక్షముఁ
జక్కడఁగింప; నోసి! కుల । నాశని! యెక్కడ దాపరించితే? ॥

కైక—అవునవును. నీవిచ్చినవరములు బ్రసాదింపుమని నందులకా? నేను భీషణకాలసర్పమైతిని? సత్యసంధునివోలె మొదట డాంబికములును, పిదప నప్రియములునా? నీ వనృతవాదివని తెలిసినచో నేనేల నిన్నడిగెదను. నావలన నీ కెందులకీ కోపతాపములు? ఇప్పుడు మించిపోయిన దేమి? నీవరములువలదు. నీరాజ్యము వలదు. నేనింక నీటనో, త్రాటనో, విషాగ్నినో, ప్రాణత్యాగ మొనర్చుకొనెదఁగాక. (పోఁబోవును.)

దశ—(ఆమెను పట్టుకొని) కైకా! తొందరపడకుము. నేనాడితప్పను. నీయభిమత మీడేర్చెదను. భరతుని రాజుఁజేసెదను. కాని, నా రాముని, జగదభిరాముని, నాయూఁతవప్రాణుని, భాస్కరవంశసోముని, శ్రీరాముని మాత్రమరణ్యములకుఁబంపు వరమును వదలుకొనుము. నాప్రాణమైన నిచ్చెదఁగాని సీతారాముని విడచి నిముసము బ్రతుకఁజాలను. కైకేయీ! నా యీప్రార్థనఁ దోసివేయకుము. పుత్రభిక్ష పెట్టుము. నన్ను మన్నింపుము.

కైక—రాజేంద్రా! నీవలె నే నాడినమాటఁ దప్పఁజాలను. నీవు నన్నర్థింపవలదు. వరములిచ్చెదవా? నన్నుఁ జచ్చుటకై చావమనెదవా?

దశ—హా! ఇంకేమున్నది? సర్వనాశనము. ఇది స్త్రీ కాదు. కేవలము రాక్షసి. రఘుకుల క్షీరవారాశిని హాలాహలముఁ జేయ నాకిల్లాలైనదిగాని వేఱుకాదు. హా! రామచంద్రా!

గీ॥ రాజరాజగు నిన్నుఁత । రాజుఁజేసి
భరతునకు పట్టముంగట్టి । పదియునాలు
గేండ్లు వనవాసమొనరింప । నేగుమనుచుఁ
బలికి, నేనింక జీవింపఁ । గలనె తండ్రీ! ॥

రామా! సుగుణాభిరామా! నీపట్టభంగము విని జగంబునఁగల నాబాలగోపాలము నన్నెంతదూఱునోగదా! నీతల్లి కౌసల్య నీదుర్గతి విన్నచో గుండెపగిలి చచ్చునుగాని మఱి బ్రతుకఁగలదా? నేనామె మొగమెట్లు చూచెదనోయీ! ఏమని యూరడింతునోయీ! హా రామా! రామా! (కంటనీరుఁగార్చును)

కైక—రాజా! మాటాడవేమి? వరములిచ్చెదవా? లేదా?

దశ—వరములా ? (తలపంకించును.)

కైక—ఓహో! మరల మొదటికేవచ్చితివే? ఇదేమిగ్రహచారము? నన్నిట్లు వేధించెదవేల ? లేక కౌసల్యవలన భయపడుచుంటివా? ఆడుదానికిచ్చిన వరములు తిరిగి యిచ్చుటకే నీకు స్వతంత్ర్యములేదని గ్రహింపఁజాలకపోతివిగదా ? నృపాలా! కాలవిళంబమునకే నింక నోర్వఁజాలను. అదిగో చూడుము! తూర్పు రేఖలు తెల్లవారుచున్నవి. అల్లదే ! మంగళధ్వనులుఁగూడ వినవచ్చుచున్నవి. నీవాలసించిన రాముఁడే రాజగును. నేఁజచ్చుట నిజమగును. నీ వీదురభిప్రాయమందుంచుటచేతనే మౌనము ధరించితివి. (చప్పుడాలించి) ఎవరో వచ్చునది. (తెలివైపుఁజూచి) ఓహో! సుమంత్రుఁడిటు వచ్చుచున్నాఁడు. నేనే వీనికిఁ బ్రత్యుత్తరమిచ్చి కార్యము సాధించెదఁగాక.

సుమంత్రుఁడు—(ప్రవేశించి) మహారాజా ! వందనము.

దశ—(దుఃఖాశ్రువులరాల్చుచు మాటాడకుండును.)

సుమం—అమ్మా! కేకయరాజపుత్రీ! మహారాజు దుఃఖసముద్రమున మునిగిన ట్లుండెనేమి ?

కైక—చెప్పెదను. నీవు వచ్చినకారణమేమి ?

సుమం—కారణమా ? శ్రీరామ పట్టాభిషేక సమయముఁగదా ! అభిషేకమంటపమున, రాజులు, రాజర్షులు, గురువులు, సమాత్యబంధుమిత్రులాదిగ నలంకరించియున్నారు. లగ్నము వేళ సమీపించుచున్నది. మహారాజు రానికారణమున నేను వచ్చియుంటిని.

కైక—సుమంత్రా ! మహారాజుగారి యాజ్ఞయైనదని, ముందు రామచంద్రునిటకు దోడ్కొనిరమ్ము.

సుమం—చిత్తము. (నిష్క్రమించును.)

కైక—(స్వగతము) ఈతఁడు రామునిఁజూచి దుఃఖవశమున కర్తవ్యము మఱవఁగలఁడు. కావున, నేనే, తండ్రివాగ్దత్తము రామునకెఱింగించెద. ఆతఁడు తండ్రియాజ్ఞఁ బాలింపకఁ దప్పఁడు. (వెనుదిరిగిచూచి) అదిగో! సీతారామలక్ష్మణులిటేవచ్చుచున్నారు.

[సీతారామలక్ష్మణ సుమంత్ర ప్రవేశము.)

రాము—సీత—లక్ష్మణ—అమ్మా ! వందనములు.

రాము—అమ్మా! కైకమ్మా! నాన్నగారేల దుఃఖాశ్రువులరాల్చుచు, మమ్ము గన్నెత్తియైనఁ జూడకున్నారు? వారియెడ నేనేమైన నపచారముఁ గావించి యుండనుకదా? లేక మరేమైన కారణమున్నదా?

కైక—రామా! దాచిననేమిలాభము. చెప్పెదవినుము. వెనుక శంబరాసురయుద్ధంబున మీతండ్రిగారు నాకు రెండువరముల నిచ్చెదమనిరి. అవి నేనిప్పుడుకోరుకొంటిని.

రాము—తల్లీ! అందు తప్పేమున్నది? వరములు చెల్లించినారుకదా?

కైక—మీతండ్రిగారు మాటలతోఁ జెల్లించినారు. నీవు పాలింపవలయును.

రాము—అమ్మా! అందులకు బద్ధుఁడను. కార్యమేమో చెప్పుము?

కైక—భరతునకు పట్టాభిషేకమొకటి. నీవు పదునాలుగేండ్లరణ్యవాసముఁ జేయుట రెండు. ఇందులకు మీ నాన్నగారంగీకరించి, నీతోఁ జెప్పుటకు విచారించుచున్నారు. తండ్రియాజ్ఞఁ బాలించెదవా?

రాము—(సంతోషముతో) కైకమ్మా! శిరమునఁ ధరించెదను. ఈమాత్రపు భాగ్యమునకుఁ దండ్రిగారికి విచారమేల?

లక్ష్మ—అన్నా! రామచంద్రా! ఇదేమివైపరీత్యము? తండ్రిగారు నీకా పట్టభంగముఁ జేయునది?

సీత—హా! విధి! ఎంతలో నెంతమార్పుఁ గల్పించితివి?

రాము—దేవీ! తమ్ముఁడా! లక్ష్మణా! మీరు విచారింపనేల? నేనెంతయు ధన్యుండనుసుమా?

గీ॥ తల్లికైకమ్మకోరికఁ । దండ్రితీర్చ
తనయుఁడద్దానిఁ బాలింపఁ । దలఁచుకంటెఁ
బుణ్యమార్గము వేఱొకండు । భూమిఁ గలదె?
సాధుసంపర్కమునటవి పూ । జ్యంబుఁగాదొ?॥

లక్ష్మ—హా! హతవిధీ! రామపట్టాభిషేక మహోత్సవముఁ జూడ నీ కన్నులోర్వ లేకపోయెనా?

సీత—మనోహరా! నామనవి వినవలయును.

రాము—సీతా! సంశయమేల? చెప్పుము?

సీత—

ఉ॥ ఓ మహాసియమూర్తి ! భయ । దోగ్రవనంబులకేగ మీరు, చే
తోముదమానె నాకు, పతి । తోడిదె లోకము స్త్రీలకౌట శ్రీ
రామ! జయాభిరామ! ఖల । రాక్షసవంశవిరామ! సద్గుణ
స్తోమ ! యరణ్యసీమ నను । దోడ్కొనిపొమ్మ! నమస్కరించెదన్॥

రాము—ప్రాణేశ్వరీ ! భయంకరసింహశార్దూలవిషోరగాదిజంతుసంయుతారణ్యమేక ? అసూర్యంపశ్యవగు నీవు నివసించుటెడ?

సీ॥ రమణీయ మందిరా । రామసీమలుగావు
కంటక శిలలమా । ర్గములుగాని
హంసతూలికల శ । య్యాతలంబులుగావు
హుంత్తృణ రచిత త । ల్పములుగాని
భర్మనిర్మిత శుభ్ర । ప్రాసాదములుగావు
మొంపటాకులగిప్ప ! కింజ్ఞగాని
ఆతత చీనిచీ । నాంబరములుగావు
జటిలకాషాయ వ । స్త్రములుగాని

గీ॥ నాతి! చవులూరు షడ్రసా । న్నములుగావు
వనుల సంప్రాప్తి కాయ దుం । పలునుగాని
జానకీ ! కష్టములనోర్వ । జాలవీవు
కాలమును వెళ్ళబుచ్చ ని । క్కడనెయుండి॥

మీరటులననదగునా ?

సీత—ప్రాణపతీ ! నేను మీకర్ధాంగి నగుట, గష్టసుఖములయందు నాకును సమభాగముగలదు. కావున, మీరెక్కడనున్న, నాకక్కడనే యానందము. వెండియు.

గీ॥ ఇంటనున్న, మహాటవి । నెందునున్న
బతినివెన్నంటియున్నదే । పరమసాధ్వి;
పతిననుగమింప లేనట్టి । భార్యబ్రతుకు
బండగట్టుక నూతను । బడుటగాదె?॥

సర్వజ్ఞులగు మీకు దెలియనిదేమున్నది ? మిమ్ము విడిచి నేనొక క్షణమైన బ్రతుకజాలను. ప్రాణాధినాథా ! నాప్రియాణమున కాజ్ఞ నొసంగుడు.

రాము—(స్వగతము) అకటా! నేనేమి సేయుదును? ఎండకన్నెఱుంగని యీసాధ్వి నరణ్యభూముల కెట్లు గొంపోవుదును. ఈమెయెడబాటు నేమ మాత్రము సైపఁగలనా?

(అనుబంధము 8)

సీత—జీవితేశ్వరా! నన్నుఁగూర్చి సంశయింపవలదు. నామేనఁ బ్రాణములుండఁ జూచినఁ గొనిపొండు. (వానిపాదముల నొరుగుచు) మీమృదుచరణారవింద సందర్శనభాగ్యమేనాకు దూరమగునో? యీనాడు—

(అనుబంధము 9)

రాము—దేవీ! అమంగళము స్మరింపకుము. నేనుమాత్రము నిన్నువిడిచి యుండఁగలనా? గహనాంతరములఁ గష్టములనుభవింపలేవని యట్లంటిని గాని వేఱుకాదు. నావెంటనే వచ్చెదవుగాక.

సీత—మహాభాగ్యము.

లక్ష్మ—అన్నా! రామచంద్రా! ఇదేమి వైపరీత్యము? మతిమాలిన రాజేంద్రుఁడు వరములిచ్చుటయు, నీమాయలాడి నీకుఁజెప్పుటయు, పత్నీసహితముగ నీవడవుల కేఁగఁదలఁచుటయు నెవ్వరైన విశ్వసింతురా? ఏమినీవెఱ్ఱి?

రాము—లక్ష్మణా! శాంతింపుము. పూజ్యులగు తల్లిదండ్రుల దూషింపుటఁ బాపముసుమా? తండ్రివాగ్దత్తమును, తల్లినెఱవేర్చుకొనినది. ఇందెవరి పొరబాటునులేదు. తండ్రి సత్యవాక్పాలనమే నాకిప్పుడు శరణ్యము.

లక్ష్మ—అగ్రజా! నేనిందులకు సమ్మతింపను.

మ॥ ధరణీరాజ్యము నేలఁగా భరతుఁడిం । తన్ జేసె సైరింతునా?
గరళంబున్ వెసగ్రక్కినట్టి చెనటన్ । కైకన్ తలద్రుంపనా?
ధరణీజాతయు, నీవు కానలకు నేం । తన్ బోవ నేనోర్తునా?
వరమిమ్మిప్పుడె యోధ్య పట్టణము ని । ర్మానుష్యముం జేసెదన్॥

రాము—(లక్ష్మణుని బట్టుకొని) తమ్ముఁడా! నీకోపాగ్నిచే నెవ్వని దహింపఁ జేసెదవు?

గీ॥ ఆడితప్పక నిచ్చిన । వాఁడుతండ్రి
తనమనోరథమీడేర్చు । కొనెనుతల్లి
క్షోణిఁబాలింపనున్నాఁడు । సోదరుండు
నింకెవరిఁజంపి యపకీర్తి । నొందెదయ్య!॥

మనతండ్రి వాక్పరిపాలనమే నాకు రాజ్యపట్టాభిషేకము. రాజ్ఞ
నౌదల ధరించుటే కర్తవ్యము. ఇంక నీక్రోధాగ్నిఁ జల్లార్చి నీవు భరతునకు
కుడిభుజమవై రాజ్యముఁ బాలింపఁజేయుము. నేనికఁ బోయివచ్చెదను.

లక్ష్మ—అన్నా! పాడువడిన యయోధ్యలో నేనుండఁజాలను. నన్నుఁగూడ మీ
వెంటఁ గొనిపొండు. రామలక్ష్మణ శబ్దము రెండుఁగాఁగూడదు.

రాము—తమ్ముఁడా! నీవడవుల నిడుమలఁబడ నేల సాహసించెదవు. వలదు. నీవిక్క-
డనే యుండుము.

లక్ష్మ—అగ్రజా! మీపాదసేవకంటె నాకొండు భాగ్య మీజగత్తునలేదు. మీరు
నన్ననుగ్రహింపకున్న ప్రాణత్యాగ మొనరింతుఁగాని మనియుండఁ
జాలను. ఇవె నావందనములు.

రాము—మంచిది. నీవుఁగూడ నన్ననుసరింపుము. మనకింకేమున్నది? తండ్రిగారి
యాశీర్వాదముంబడసి మఱి పోవుదముగాక. (సమీపించి) నాయనగారూ!

దశ—(రాముని కౌఁగిలించుకొని) హా రామా! దశరథరామా! జానకీరామా!
ఈకైక నీపాలిట పెద్దమ్మయై, నాపాలిట మారియైనది. నిన్నువిడచి నేనింక
బ్రతుకఁజాలను.

రాము—తండ్రీ! ఊరడిల్లుము. అమ్మను దూరకుము. సత్యవాక్పాలనమే నాకు
రాజ్యాది భోగసామ్రాజ్యము.

గీ॥ భరతుఁడే రాముఁడనుచు నీ । వరయుచుండు
మటవియందుఁ బదునాలు । గబ్దములును
పదియు నాల్గుదినంబులు । వగిదిఁజేతుఁ
గౌఁగిలి దుఃఖింపకయ్య! నేఁ । బోయివత్తు॥

దశ—రామచంద్రా! ఏమంటివి? పోయి వచ్చెదనంటివా?

గీ॥ అత్తవారింటికేవుఁ బ్ర । యాణమయ్యె
నన్నుఁ బ్రశ్నింప; నిన్ విడ । నాడలేక
త్రేపుమాపని జరుపు నే । నేపగిదిని
భీకరాటవిఁ బొమ్మందు । రా! కుమార!॥

సుమంతా! సుమంతా! కార్యమతిక్రమించినది. రఘువంశక్షీరవారాశి
యందుఁ గైకయనెడి హాలాహలము జన్మించినది. మారణోపాయమున కింక
మార్గములేదు. నీవింక సబాంధవముగ చతురంగ బలములతో సీతారామ

ల నడవికిఁ దోడ్కొనిపొమ్ము. నిర్జనమై, కళావిహీనమై, నిషేధమై నడచిన పట్టణమును పాపిష్ఠికైక తనకుమారునితోఁ బాలించుఁగాక.

త్తము.

జేంద్రా! ఇదియేనా నీసత్యసంధత? నీవు నీసత్యమునుఁ గాపాడుకొనఁ చితివేని, సీతారామలక్ష్మణులు నాకన్నులయెదుటనే సర్వాభరణములు విచి, నారచీరలు గట్టుకొని యరణ్యమున కరుగవలయును. అట్లుఁ జేయింపవేని, నాదారి నేనుఁ జూచుకొందును.

దశ—దుష్టాంతఃకరణా! ఇదిగో చచ్చితివి. (చంద్రహాసముఁ దీయఁబోవును)

రాము—(పట్టుకొని) జనకా! శాంతింపుఁడు. మీయుద్రేకము ధర్మభంగమగును. కైకమ్మగారి యాజ్ఞాప్రకారమే వర్తించెదను. అమ్మా! మతిచెడియున్న తండ్రిగారిపయిఁ గోపింపకుము. నీకోరికప్రకారమే నడచుకొందును.

దశ—రామా! రామా! దాసియభిమతమే మీకోర్కెదవా? అయ్యో! తండ్రీ! అటవీనివాసరూపమున నిన్నుఁ గాంచి నేనింక బ్రతుకఁగలనా? నీవియోగము భరింపఁగలనా? మొగమెత్తి నేనీలోకముఁ జూడఁగలనా? నిన్నుఁ బాయఁగలనా? అయ్యో! నాజీవితమా! నాజీవనాధారమా! నావంశరత్నమా! రామా! రామా! (మూర్ఛిల్లును)

రాము—అయ్యో! తండ్రిగారు దుఃఖాకలితచిత్తులై మూర్ఛమునింగెనుగదా! నే నేమిసేయుదును? ముందుకర్తవ్యమునకుఁ గడంగవలయును గదా! అమ్మా వల్కలాంబరములఁ దెప్పింపుము. ప్రయాణమునకు సిద్ధమయ్యెదము.

కైక—అన్నియు సిద్ధముగానున్నవి. లోని కేగుదమురండు.

రాము—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

---

తృతీయదృశ్యము—గంగాతీరము.

[జటావల్కలధారులగు సీతారామలక్ష్మణులు రథారూఢులై సుమంతునితోఁ బ్రవేశము.]

రాము—సీతాలక్ష్మణులారా! అల్లదే లోకపావని యగు గంగాభవాని.

గీ॥ చక్రిపాదారవింద । జనితమయ్యు
హరజటాజూటమందున । నధివసించి

వసుధఁ బ్రవహించి పతితపా । వనులఁ జేయు
గంగఁ గన్గొనఁ బాపముల్ । దొలఁగిపోవె॥

సీత—
లక్ష్మ— } ధన్యోస్మి. ధన్యోస్మి.

రాము—సుమంతా! నీవింక రథముతో నయోధ్యకుఁ బొమ్ము. ఇంక మేము నదిని దాటి పోవలయును.

సుమం—రామచంద్రా! మిమ్ము విడచి నేనేగఁజాలను. నన్నుఁగూడ మీవెంటఁ గొనిపొండు.

రాము—అయ్యా! నీవు మాకొఱకు విచారింపవలదు. నీవుపోయి సీతారామలక్ష్మణులు గంగానది దాటిరని చెప్పినఁగాని మాకైకమ్మ నమ్మ ఆలసింపకఁ బోయిరమ్ము.

సుమం—శ్రీరామచంద్రా! కైకమ్మగారి కీశుభవార్త నేనేఁ జెప్పవలయుగాన నే నెట్లును పోవకఁ దప్పదు. పూజ్యులగు మీతల్లిదండ్రులకేమని విన్నవింతును?

రాము—సుమంతా! ఇట్లని వచింపుము.

సీ॥ ననుఁగని పెంచిన । నాతల్లిదండ్రుల
పాదపద్మములకుఁ । బ్రణతులనుచు
కడుపుదుఃఖంబునఁ । గొడుకా! కొడుకయంచు
నేప్రొద్దు పొరలెడు । నేస్త్రీకనుచు
కడిపెను దుఃఖంబు । గలిగించినాఁడను
కోపంబుఁ దండ్రిపైఁ । గూడదనుచు
కైకమ్మకొడుకు దు । ర్గతికి కారణమని
దూషించితేని నా । తోడటంచుఁ

గీ॥ జీఁకటులుబోయి వెన్నెలల్ । రాకయున్నె?
అనుచు నాతల్లి కెంతయో । నచ్చఁ జెప్పి
రామ! రామా! యటంచు ని । రంతరంబు
నడల వలదంచుఁ దండ్రితో । నడువుమయ్య!॥

లక్ష్మ—అమాత్యవరా! నేనిట్లంటినను.

గీ॥ రాజ్యమునకంటెఁ బ్రీతి న । రణ్యములను
గడపి పదునాలుగబ్దముల్ । పుడమినేల

రాముఁడరుదెంచు; మిమ్ములఁ । బ్రేమఁగాంచు
ననుచుఁ దలిదండ్రితోఁ జెప్పు । మనఘచరిత !॥

సూత్తమా ! నావచనములుగ నిట్లు నివేదింపుము.

గీ॥ మువ్వురత్తలకును భక్తి । మ్రొక్కి నాను
నత్త కౌసల్యదీనెన । లటవినున్న
మాకి మోఘము లయ్యె, నా । మామగారి
యాజ్ఞఁ బాలించినచ్చెద । మనుచుఁ జెప్పుము॥

మాల్ల ! ఇంకఁ బోయిరమ్ము.

సుమం—చిత్తము. (రథముతో నిష్క్రమించును)

రాము—అదుగో ! సర్వము సిద్ధఁబఱచి గుహుఁడిటు వచ్చుచున్నాఁడు.

గుహుఁడు—బాబయ్యా ! దండాలు. పడవ సిద్ధంచేశాను. దయచేయండి !

రాము—మంచిది. సీతాలక్ష్మణులారా ! పోవుదము రండు. (అందఱు లోనికేగుదురు)

---

చతుర్థదృశ్యము—కైకమందిరము.

[భరతుఁడు, కైక ప్రవేశము]

భర—అమ్మా ! కైకమ్మా !

గీ॥ ఏల యీలీల నీతల । నేలవాల్చి
కన్నుఁదోయిని బాష్పముల్ । గార్చుచుంటి
వమ్మ ! సోదరులాది నీ । లమ్మ సుఖమె ?
తల్లులకుఁ దండ్రికని సుఖ । దాయకంబె॥

కైక—నాయనా ! భరతా ! (కన్నుల నీరద్దుకొనును)

భర—అయ్యో ! జననీ ! ఏమిపరిభయము సంభవించినదమ్మా !

కైక—నాయనా ! మీతండ్రిగారు

భర—ఆ ! ఏమీ ! తండ్రిగారా ! తండ్రిగారికేమి ?

కైక—స్వర్గమలంకరించిరి.

భర—హా ! తండ్రి ! (మూర్ఛిల్లును)

కైక—(దరిఁజేరి) కుమారా ! భరతా ! లెమ్మునాయనా !

భర—హా! తండ్రీ! పుత్రవత్సలా!

ఆ॥ వె॥ నన్నుఁ గన్నతండ్రి! నాయనా! నిబ్బుణ
మెట్లుఁ దీర్చుకొందు? నేమి సేతు?
మరణకాలమందు గరిటెడు తులసి తీ
ర్థమ్ము నోటఁబోయఁ దగక పోతి॥

కైక—కుమారా! ఊరడిల్లుము.

భర—హా తండ్రీ! నేను మాతామహుని యింటికిఁ బోవకున్నచో శ్రీ దులవలె నేను నీసేవఁ జేసి ఋణశేషముఁ గొంచెమైనను దీర్చుదునుగదా?

కైక—అయ్యో! తండ్రీ! నాయనను దురదృష్టవంతుఁడే.

భర—ఏమీ! సమయమునకు రామలక్ష్మణులుఁ గూడ లేరా? అక్కటా! నల్వురు కుమారులం బడసిన దశరథసార్వభౌముఁడు దిక్కుమాలినవాఁడై, తుదకుఁ దన కులచేనగ్ని సంస్కారముఁ గావింపఁబడెనా?

కైక—నాయనా! మీనాయనగారు దహింపబడక తైలఘటమున భద్రపరుపఁబడి యున్నారు.

భర—నపువ్వుము. మృతశరీరమైనఁ జూచుభాగ్యముఁ గలిగినది. ముందాపద్దేశమునకు నడువుము.

(అంత, మంథరను తరుముకొనుచు శత్రుఘ్నుఁడు ప్రవేశము)

శత్రు—నిలువుము. పాపాత్మురాలా! నిలువుము. నిన్ను కృపాణధారకు బలియిచ్చినఁగాని మాయాత్మకు శాంతిలేదు.

మంధ—(కైక పాదములఁబడి) అమ్మా! రక్షింపుము.

భర—తమ్ముఁడా! శత్రుఘ్నా! ఈస్త్రీ హత్యాపాతక మేమి?

శత్రు—అన్నా! వినుము. ఈరాకాసివలన సర్వనాశన మైనది. ముందీకులటను సంహరించి తరువాతఁ జెప్పెదను.

మంథ—అమ్మా! చూచితివా? మధ్య నాకు గండ మేమిటమ్మా! సీతారామలక్ష్మణు లడవికేగుటకు నేనే కారణమని, నన్నుఁ జంపవచ్చుట న్యాయమఁటమ్మా! నీవయినఁ జెప్పవేమమ్మా?

భర—ఏమీ! సీతారామలక్ష్మణు లడవికేగినారా? తమ్ముఁడా? నాకేమియు బోధపడలేదు. కారణముఁ జెప్పుము.

గా! కారణమా? శ్రీరామునకు వనవాసము, నీకు పట్టాభిషేకముఁ
నీదాసీముండ కైకమ్మను ప్రోత్సహించి, తండ్రిని నిర్బంధపఱచె

మ్మా! ఇదంతయు వాస్తవమే?

గతము) కార్యము తలక్రిందులైనది. అనుభవమునఁగాని యజ్ఞానము లఁగదు. కానిమ్ము. (ప్రకాశముగ) కుమారా! నీవద్ద దాపరమేల? వెనుక మీతండ్రిగారు రెండువరములు నాకిచ్చియున్నారు. ఒకటి శ్రీరామ ప్రవాసమును, రెండు భరత పట్టాభిషేకమునుఁ గోరితిని. నిజనకుఁ డంగీకరించెను. పితృవాక్యపాలనార్థమై రాముఁ డరణ్యములకుఁ బోయెను. పుత్ర వియోగమున మీతండ్రిగారు మరణించిరి. ఇదియే వృత్తాంతము.

భర—(గుండెఁ గొట్టుకొనుచు) హా! హా! రాజకుల వంశనాశనీ! ఎంతటి ద్రోహ మాచరించితివే?

కం॥ నాకేరాజ్యముఁ గావలె
నేకోన్నమాయంచు నీకుఁ జెప్పితినో?
రాకాసి! రామచంద్రులఁ
గీకారణ్యములఁ దోలి తే కరణినిసీ!॥

హా! రామచంద్రా! సద్గుణసాంద్రా! నీకింతటి మహాద్రోహముఁ గావించినది నేనేయని యెంత విచారపడితివో గదా! భ్రాతృద్రోహి నైతినని కౌసల్యాదేవి యెంతని విలపించెనో? భరతుఁడు పడకపామయ్యెనని సీతమ్మతల్లి యేమనిదూరెనో? కానికార్యముఁ జేసి కులమునకు కళంకమాపాదించితినని లక్ష్మణానుజుఁ డేమనిదూషించెనో? పురజనులెంతఁ దిట్టుచున్నారో? హా! ఛీ! భరతా! ఎట్టి చెడులగ్నమున నీవీ పాపిష్ఠకైకేయి గర్భమున జనించితివో గదా! నీజీవితమున కింక సద్గతిగలదా? లేదు. ముమ్మాటికి లేదు. భ్రాతృద్రోహి ననిపించుకొని మని యుండఁగలనా? హా? నేనెంత పాపకర్ముండను.

శత్రు—అన్నా? ముందీ మంథరను చంపివేసెద నాజ్ఞయిమ్ము?

భర—తమ్ముఁడా! శాంతింపుము. రాజాజ్ఞలేనిది మనమట్టి సాహసపుఁ బనులు జేయరాదు. దీనివిషయ మావల విచారించెదము! మనమింక జాగుజేయరాదు.

ముందు తండ్రిగారికి దహనక్రియలఁగావించి యనంతరము పుంగవులతోడను, తల్లులతోడను! మనమందర మరణ్యాః శ్రీరామచంద్రుని పాదపద్మములపైఁబడి ప్రార్థించి, యెట్టులేని ధ్యర్యఁగొనివచ్చి సింహాసనా సీనులఁగావించినఁగాని, న్యాయాఁ, లేదు. అట్టుల జరుగదేని, యేపాపమెఱుంగని యీభరతుఁడు, ణామున జీవింపఁజాలఁడు. పోవుదమురమ్ము.

శత్రు—చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు.)

మంథ—అయ్యో! కైకమ్మా! తుదకదేమి ప్రారబ్ధమమ్మా!

కైక—ఛీ! ఛీ! పాపాత్మురాలా! నీవె మాకొంపఁదీసితివి.

మంథ—అమ్మా! నేనేమిచేసితిని. రాజ్యమిప్పించితినిగదా?

కైక—నీరాజ్యము నీవుఁ దగులఁబడిపోను. నీసహాయమువలన రాము రాజును విరాగిగాఁజేయించి, తుదకు స్వకులనాశనమునకు దారిఁజూపెన నీమొగమింకఁ జూడరాదు. అవలకుఁబొమ్ము.

మంథ—అమ్మా! పోనిమ్ము. మఱియొక యుపాయము.

కైక—నోరుమూయుము. కులటా! ఒకయుపాయమున సర్వమునఁ బాడుచేయించి, నాప్రాణనాథుని జీవితములఁగూడ హరింపఁజేసితివి. ఇంక నాయెదుటనుండి వెడలిపొమ్ము. (నిష్క్రమించును.)

మంథ—ఓయబ్బో! ఇదంతా గింజములాగున్నదే (లోనికేగును.)

---

పంచమదృశ్యము—అరణ్యము.

లక్ష్మ—(కోపముతో) అన్నా! రామచంద్రా! మోసము. మోసము.

రాము—లక్ష్మణా! ఏమది?

లక్ష్మ—ఏమున్నది? రాజ్యసర్వస్వ మపహరించిన భరతశత్రుఘ్నులు ససైన్యముగ మనపైకిదే వచ్చుచున్నారు. చూచితిరా! వానికంతకొవ్వా?

రాము—తమ్ముఁడా! శాంతింపుము. భరతుని యభిప్రాయమది కాదుసుమా?

లక్ష్మ—చిత్తము.

(తెరలో)

ఓయటవీ నివాసురాలా! రామచంద్రుఁడెందున్నాఁడు?

రాము—లక్ష్మణా! సీతా! మనలఁగానలేక భరతుఁడాక్రందనము సేయుచున్నాఁడు.

పెద్దపిన్నలతోఁ జనుదెంచుచున్నవాఁడు. గావున మనమెదురేగి
తోడ్కొనివత్తమురండు. (నిష్క్రమింతురు.)

—(ప్రవేశించి) అకటా! దశరథునిమరణము వినినంతనే, రామచంద్రుని
దుఃఖమునకు మేరలేదుగదా? తుట్టతుదకు దశరథమహారాజునకు
అడవిలో క్రియలు సేయవలసి వచ్చెనుగదా? అల్లదె! క్రియలు సంపూ
ర్ణముగఁ జేసి రామాదులిటే వచ్చుచున్నారు. ఇంతకుముందే పట్టణము
నకు రమ్మని రామునితోఁ జెప్పియుంటిని. కాని ప్రయోజనములేదు. మఱి
యొకసారి చెప్పి చూచెదను.

(రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు ప్రవేశము.)

వసి—రామా! ఇంకఁగర్తవ్యమేమి ?

రాము—కర్తవ్యమునకేమున్నది? మిమ్ము పట్టణాభిముఖులంజేసి, మేమీప్రదేశ
ములఁ సంచరించుటేగదా?

భర—అన్నా? రామచంద్రా! నాప్రార్థనమాలించి, పట్టణమునకు దయచేయుఁడు.

రాము—తమ్ముఁడా! నీకిదియేమి వెఱ్ఱి ?

గీ॥ తండ్రి వాక్యపరిపాలనా । ర్థంబుగాదె ?
వనులఁ జేరితి? పదునాల్గు । వత్సరములు
జెల్లునందాఁక బురిఁబ్రవే । శింపరాదు.
నీవె పాలింపుముందాఁక । నేలనేలమి॥

భర—సోదరాగ్రణీ? రామ రాజ్యసింహాసన మధిష్ఠింప నేనర్హుండను గాను సుమా!

గీ॥ ఓరఘూత్తమ? నీచర । ణారవింద
పాలనమె, రాజ్యవైభవ । పాలనంబు
వేఱయోచనలేదు ని । న్నీడఁజాల
నేను నీవెంటవత్తు, మ । న్నింపుమయ్య!॥

రాము—సోదరా! పితాజ్ఞమనయిరువురకు సమానముగనున్నది. నీవు రాజ్యమే
లకతప్పదు. నాకటవీనివాసముండకతప్పదు? మాఱుమాటాడకఁ బోయిరమ్ము.

భర—హా! రామచంద్రా! మీయాజ్ఞ నేను పాలింపకతప్పదు. కాని, రాజ్యపాల
నమే నామార్గమున కంటకముగనున్నది. అయోధ్యానగరసింహాసనా
ధ్యక్షత కే నర్హుండనుగాను. కావున, మీరురాకున్నను, మీపాదుకలయిన

నాకొసంగుఁడు. పాదుకలకు బట్టముఁగట్టి ప్రతినిధినై
ఇందుల కైన నన్ననుగ్రహింపుఁడు.

రాము—తమ్ముఁడా! నాయందు నీకున్న భక్తికి మెచ్చితిని. ఇవె న
గైకొనుము. (అని యిచ్చును.)

భర—(పుచ్చుకొని కన్నులనద్దుకొని) ఆహా! నేనెంతయు ధన్యుఁడనుకదా.
ఒకమనవి. పదునాల్గువత్సరములు నే నీవిధముగనె రాజ్యమేలు
వనవాసాంతరమున మీరయోధ్యకు రాకున్నచో, నేనగ్నిఁబ్ర-

రాము—తమ్ముఁడా! తప్పక వచ్చి తీరెదను. కాని, నీవు కైకే
యమ్మనుగాని, మంథరనుగాని దూషించిన నన్ను నీవుదూషించినట్లె సుమా!

భర—చిత్తము.

రాము—మీరింకఁ బోయిరండు; వసిష్ఠమునీంద్రా! నావందనములందుకొని పో
యిరండు.

వసి—రామా! విజయశాలివై తిరిగి యయోధ్యాపట్టాభిషిక్తుఁడవయ్యెద
వుగాక.

రాము—భాగ్యము!

భర—రామచంద్రా! వసిష్ఠమునీంద్రా! రాముఁడులేని యయోధ్య నేఁ జూడఁజాల
ను. నందిగ్రామమందె పాదుకాపట్టాభిషేకము చేసి యందే నివసింపనాజ్ఞ
నొసంగుఁడు.

రాము—అటులనే యొనర్పుము.

భర—చిత్తము. (అనుబంధము 11)

(యవనికజారును.)





శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సంపూర్ణ రామాయణము.

## తృతీయాంకము.

ప్రథమదృశ్యము—పర్ణశాల.

[సీతారాములు కూర్చుండియుందురు. లక్ష్మణుఁడు నిలువఁబడి యుండును.]

రాము—నిమిరాజసుతామణీ! ప్రాణేశ్వరీ! నిస్తులవిషాదహృదయనిమగ్నవగు నిన్నుఁ జూచి నేనెట్లు సహింపఁగలను?

సీ॥ కుటిలకంటకచమూ । ఘోరాటవులయందు
నడచితే? యెప్పుడేని । నళిననేత్రి!
శరభశార్దూలాది । చటులారావంబులు
వింటివే? యెప్పుడేని । విద్రుమోష్ఠి!
ఘనదవానలధూమ్ర । కటిక యెడారులం
గంటివే? యెప్పుడేని । కమలపాణి!
కమలాప్తతప్తమై । కత శిలాస్థలముల
నిలిచితే? యెప్పుడేని । నీలవేణి!

గీ॥ రాజభోగాది సౌఖ్యవా । రాశియందు
నోలలాడంగ రాముని । ల్లాలివయ్యు
నారచీరలు ధరియించి । నట్టడవులఁ
గష్టములఁబొందు నినుఁ జూడఁ । గలనె? లలన!.

దేవీ! వనవాసము దురంతాయాసమని యెంతఁజెప్పినను వినక, నావెంటఁబడి వచ్చినందులకు నీవనుభవించు ఫలమిదియేగదా?

సీ॥ మధురిమోపేత భో । జనసౌఖ్యమే నీకు
లలితాంగి! కందమూ । లములవిందు
శుకపిక శారికా । సుస్వనంబులె నీకు
కల్యాణి! మృగముల । గర్జనములు
రాజిత రాణ్మంది । రముల నీడయె నీకు
సాధ్వి! కాంతారవృ । క్షముల నీడ
నరగపట్టుడు కాల । శయ్యాతలమె నీకు
కనకాంగి! పాషాణ । కలిత భూమి

గీ॥ కనకసోపాన గమన సౌ । ఖ్యంబె నీకు
భయద కాంతారభీకరో । జ్జ్వలితకటక
చటులసానుప్రదేశ సం । కటము లకట!
సాధుసావిత్రి! జనకభూ । జానిపుత్రి!॥

సీత—ప్రాణేశ్వరా! మీకన్న నేనధికురాలనా? మహారాజపుత్రులగు మీరే యిట్టి కష్టపరంపరలనెదుర్కొనుచుండ, భవచ్చరణసేవకురాలనగు నేనెంత? మొట్టమొదటఁ గొంచెముఁ గష్టమైనను, క్రమక్రమముగ నదియె సుఖప్రదమగును. నావిషయమై మీ రనవరతముఁ గృశించి చింతింపవలదు. మీపాదసేవయే నాకు రాజ్యాది మహాభోగసౌఖ్యపరాయణత్వము. మీదివ్యసుందరవదనారవింద సందర్శనమే నాకు స్వర్గతుల్యముసుడీ!

లక్ష్మ—అగ్రజా! సాధ్వీమతల్లియగు మాసీతమ్మకష్టములు గట్టెక్కకుండునా? ఇప్పటికే వనవాసము పదిపండ్రెండేండ్లు గడచినవి గదా?

రాము—అవును. ఇఁక కొలఁదికాలమునకుఁ బట్టణముఁ జేరిసుఖింపవచ్చును. తమ్ముఁడా! మనకీ వనవాసకారణమున నెన్నియో లాభములు గలిగెనవిసుమా!

సీ॥ పరమపావనములౌ । భాగీరథీ మొదల్
విమల తీర్థములు సే । వించినాము
జగదపకారులై । నెగడు విరాధాది
చెనటిరాక్షసులను । జనకినాము
దర్శింపఁగా నసా । ధ్యంబౌ నగస్త్యాది
ఋషులనెందరినో ద । ర్శించినాము

సృష్టియందున సురా । సురుల కభేద్యమా
భయదాస్త్రశస్త్రముల్ । వడసినాము
సీ॥ అరయఁ, గైకమ్మరాజ్యాదు । లపహరించి
యీజటావల్కలములు ధ । రింపఁజేసి
వనుల విహరింపఁ జేయుట । వలనఁగాదె?
ధన్య మయ్యెను మనజీవి । తములు ననుజ !॥

లక్ష్మ—రామచంద్రా! ఆమె మన కొనరించిన మేలు బ్రహ్మకల్పాంతమువఱకు లోకము మఱవఁజాలదుసుమా!

రాము—(తెరవంకఁ జూచి) లక్ష్మణా! అద్భుతాకారము! ఒక స్త్రీవ్యక్తి కాబోలు నిటు వచ్చుచున్నది.

లక్ష్మ—(చూచి) అవును. అదియొక మాయావివలె నున్నది.

శూర్పణఖ—(ప్రవేశించి తనలో) ఆహా! సుందరాకారులగు రామలక్ష్మణు లిందే యున్నవారు. ఆమెయే సీతాసతి. ఇంక వీరల సమీపించి నాచతురిమఁ జూపెదఁగాక. (సమీపించి) పురుషవరేణ్యులారా! మీరలెవ్వరు? అటవీనివాసమునకుఁ గారణమేమి?

రాము—లక్ష్మణా! ప్రత్యుత్తర మిమ్ము.

లక్ష్మ—ఓరమణీ! మేమిరువుర మన్నదమ్ములము. అతఁడు శ్రీరాముఁడు. నేను లక్ష్మణుఁడను. ఆమహిళాలలామ నాయగ్రజుని పట్టమహిషియగు సీతామహాదేవి. కొండొకకారణమున రాజ్యాదులు దూరమైనను క్షాత్రధర్మముగ నరణ్యముఁ బాలింపుచున్నాము. ఇది మావృత్తాంతము. ఇంక నీయుదంతముఁ దెలియఁ జేయుము?

శూర్ప—సుందరాంగులారా! లోకవిద్రావణుండగు రావణుఁడు నా కగ్రజుండు. మానిలయము లంకాపురము. నాపేరు శూర్పణఖ. (రాముని సమీపించి) సుందరాకారా! నానిజాభిప్రాయము వినుము. నిన్నిప్రాంతములం దనేక పర్యాయములుఁ జూచి, కాముబారికి లోనైతిని. నేఁటికి సాహసించి నీకృపాభిక్షువనై వచ్చితిని. నన్ననుగ్రహించితివేని, ధరామండలమునకు నిన్నభిషిక్తునిఁ జేయించెద. నాముద్దుఁ జెల్లింపుము.

రాము—(స్వగతము) ఓహో! ఇది రాక్షసాంగనయని స్థిరపడినది. చమత్కారముగ

దీనిని శిక్షింపఁ జేసెదను. (పరిహాసముగ) ఓకామినీ! నీకో కరం
రాదుగాని, నాకొక భార్యకలదు. నాతమ్ముఁడంగనారహితుఁడు. అతఁడే
నీకోరిక దీర్పఁ గలఁడు. అంతేకాదుసుమా!

గీ॥ కుసుమశరుసేలువాఁడు, బల్ । రసికవరుఁడు
రమణి! నీయౌవనాంగముఁ । బ్రోఘమగుట
నెసఁగుచున్నది చెల్మి మీ । కిరువురకును
వానినింగూడి సుఖములు । వడయఁ బొమ్ము॥

శూర్ప—రూపసాదృశ్యముల మీరిరువురుఁ దీసిపోవువారుకారు. కాని, వానిసేవరిం
పుమని యెదవా?

రాము—అవును. అతఁడే నీసతికిఁ దాళ్ఁ గట్టఁదగినవాఁడు.

శూర్ప—మంచిది. నీతోఁగూడిన సవతిపోరుఁ బడలేకుందును. (లక్ష్మణునిఁ జేరి)
ఓపురుషసింహా! పండిపక్వమైయున్న నాయెలజవ్వన మనుభవింపలేని రా
ముఁడు నన్ను నీకడకుఁ బొమ్మనియె. ఆకనఁబడు లతాగుల్మములచెంత సుర
తవిలాసమునఁ బొద్దుఁబుచ్చెదము రమ్ము. (పట్టుకొనఁబోవును.)

లక్ష్మ—కాంతా! దూరముగనుండుము. నేనొకటి జెప్పెద వినుము. చందనవనము
సర్పావృతమని త్యజించినట్లు, సవతితోఁ గాపురము సరసముఁగాదని రూప
సుందరుఁడగు రామచంద్రునివిడచి నన్నేల వరింపవచ్చెదవు?

గీ॥ రూపసుందరి! నీ కను । రూపుఁడైన
దాశరథియేడ? నేనేడ? । దాసుఁడేడ?
పవలు రేలును వానికి । బానిసీడ
నైన నన్గోరఁ దగునె? హా । స్యంబుఁ గాదె?॥

శూర్ప—పోనిమ్ము. నీవుసేవకుఁడ నైనను వానికిఁ దమ్ముండవేకదా?

లక్ష్మ—పేరునకుఁ దమ్ముఁడనేఁగాని, నిరంతరము సీతారాముల పాదపద్మములఁ
గొలుచు నిర్భాగ్యుఁడను. నన్ను వరించితివేని, నాతోఁబాటు నీవాసేవలఁ
జేయఁజాలవు. కావున వానిసేవరించి సుఖింపుము.

శూర్ప—(స్వగతము) వీనిమాటలే సత్యము. ముందు పెద్దవానిముద్దులమూట
సంగ్రహించితినేని, పిన్నవాఁడు పిచ్చికుక్కయి నావెంటఁ బడకుండునా?
అటులే యొనర్చెద. (రామునిఁ జేరి) రామా!

సీత—రాము- లక్ష్మ—(నవ్వుకొనెదరు.)

శూర్ప—(సీతతో) ఓసీ! ఏమే నీపొగరుఁబోతుతనము? నన్నుఁజూచిన నీకు నవ్వు వచ్చుచున్నదిగదా? నిన్నిదే వడియములాగున నమలివేసెదఁ జూడుము. (మీఁదికేగును.)

రాము—(దానికడ్డము నిలిచి) తమ్ముఁడా! పాపము దీనికా మోహ దేకము మితిమీఱు చున్నది. వెంటనే దీనిమోహ పిశాచమును వదలఁగొట్టుము. కాంతా! లక్ష్మణుఁడు నిన్నింక సత్కరించును. పొమ్ము.

శూర్ప—(సంతోషముతో) లక్ష్మణా! నాకోరికఁ దీర్చెదవా? (మీఁదికేగును.)

లక్ష్మ—ఇదే చూడుము. (ముక్కు గట్టిగఁబట్టుకొనును.)

శూర్ప—ఓయీ! ఇదేమిసరసము. చక్కనైన స్తనపర్వతములుండ నాసికఁ బట్టుకొనెదవేల? నీకేమిపిచ్చియా?

లక్ష్మ—(ఖడ్గముఁదీసి) ఓసీ! ఇదియొక క్రొత్తసరసము.

గీ॥ ఏకపత్నీవ్రతస్థుల । నిట్టులఁ జెఱుప
వచ్చినందులకిచ్చెద । ఫలితమిదుగో!
(ముక్కుఁగోయగ నది యేడ్చుచు పఱుగెత్తఁబోవఁ జెవిఁబట్టుకొని)
చెనటి? నిలువుము, ముక్కును । చెవులుఁగోసి
రనుచు దిక్కున్నకడకు నీ । వరయఁబొమ్ము॥

(చెవులు గోయును.)

శూర్ప—(ఏడ్చుచు) ఓరోరీ దుష్టులారా! నన్నిట్లు సేయుదురా? ఇంక మీపాట్లు జూచికొనుఁడు. (పారిపోవును.)

రాము—లక్ష్మణా! మంచిపనిఁజేసితివి. మనమింక లోనికేగుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

ద్వితీయదృశ్యము—మారీచాశ్రమము.

[రావణ, మారీచులు ప్రవేశము.]

రావ—మారీచా! నీవు పెద్దవాఁడవుగదాయని యింతవఱకోర్చి యుంటిని. నా యాజ్ఞఁ ద్రోసివేయకుము. సీతాపహరణమే నాకింక గర్తవ్యము.

మారీ—రాక్షసేశ్వరా! రాముఁడు పరంధాముఁడని జగత్త్రయము వేనోళ్ళఁ బొగడుచున్నది. వెండియు,

ఉ. రాముఁడు, దైత్యరాట్కులవి । రాముఁడు; దుష్టకులీనగ [illegible] సు
త్రాముఁడు; భీకరోగ్రరణ । రంగవిహారుఁడు; నీలమేఘసు
శ్యాముఁడు; భక్తవత్సలుఁడు, । సర్వజగత్పరిపోషకుండు శ్రీ
రాముఁడు రాముఁడా? పరశు । రామ విరాముఁడు పూజనీయుఁడో॥

రావ—ఏమి నీ వాగాడంబరము?

గీ॥ కరము లిఱువదిమేనఫీ । కరముఁగలుగు
రావణాసురుఁ దిరిలోక వి । ద్రావణునకు
సాటియే; యర్కవంశ సం । జనితుఁడొకఁడు
బెబ్బులిందాక నేర్చునే? । పిల్లికూన॥

రాక్షసకులకళంకా! పండవై, వృద్ధుఁడవై, యసమర్థుఁడవై మూలఁగూర్చుండి, జగజ్జేగీయమానప్రతాపవంతుఁడనగు నాముందరనా పిఱికిమాటలాడి భయముఁగలిగింపనెంచితివి? చాలుఁజాలు. ముందు నాప్రయత్నమునకుఁ దోడు పడెదవా? లేదా? చెప్పుము. నిరాకరించితివేని మక్కరాసి నీశీర్షము ఖండించునని తెలిసికొనుము.

మారీ—(స్వగతము) ఔరా! వీనికి పోగాలమాసన్నమగుటచేతనే రామునకపకారము సేయుచున్నాఁడు. కానిమ్ము. మఱి యొకసారి చెప్పి చూచెదను. (ప్రకాశముగ) (అనుబంధము 12) ఓరావణ చక్రవర్తీ! ఇదె నాకడసారి హితోపదేశము.నీవు సీతాదేవి నపహరించితివేని?

ఉ. ధారుణిఁ బాఱినన్; గుహల । దాఁగిన; వహ్నులచెంతఁ జేరినన్
నీరధిమున్గినన్; శరణు । నీరజగర్భునిఁ గోరియుండినన్
పోరున నీశుఁడడ్డమయి । పోరిన; రాఘవుఁడాహవంబులో
ఘోరశరాగ్ని కీలలకుఁ । గూల్పకమానఁడు నిన్ను రావణా!॥

రావ—అరే! దురాత్మా! పాపీ! ఇదే చచ్చితివి. (వానిని నఱుకఁబోవును)

మారీ—(నవ్వుచు) వెఱ్ఱిరాజా! శాంతింపుము. శాంతింపుము. దానవాంతకుఁడని విఖ్యాతివడసిన రామునివిషయమై నీయభిమతమెఱుంగనట్లుఁ బలికితిఁగాని తాటకాసురసంహారసమయమున నన్నాతఁడుగొట్టిన చుఱుకుబాణము మఱచితిననుకొంటివా? ఆతఁడెట్టివాఁడైననేమి? జగత్ప్రభువగు నీవునాయుండనుండ నసాధ్యమగుకార్యమున్నదా? రమ్ము. సీతాపహరణమునకుఁ బ్రయత్నించెదము.

రావ—(వానిని కౌఁగిలించుకొని) భేష్! ఇప్పుడుగదా! నిన్ను విశ్వసించితిని. కాని యేమార్గము నవలంబింప నూహించితివి?

మారీ—నేనొక బంగారులేడినై రామలక్ష్మణుల నెడబాపెద. అంత నొంటరియగు సీతను నీవపహరింప ననుకూలమగును. ఇది నీకిష్టమె గదా!

రావ—(సంతోషముతో)బలే! మారీచా! నీ మాయామోహజాలమున జగత్త్రయమునే ఫలింపఁజేయఁగలవు. నీకసాధ్యముఁగలదా? నీయుపాయమే బాగున్నది. పోవుదముగమ్మా. (ఇరువురు వెడలిపోవుదురు.)

---

తృతీయ దృశ్యము—పర్ణశాల.

[లక్ష్మణుఁడొక ప్రక్కను, సీతారాములొక ప్రక్కను నిలువఁబడియుందురు]

సీతా—నాథా! విద్యుల్లతవలెఁ గళుకన్న మెఱసి యంతర్హితమైన యాచిత్రమేమైయుండును?

రాము—దేవీ! అదియొక మృగమేమోయని తలంచెదను.

(బంగరులేడి వారిముందు నాడుచుండును.)

సీత—(సంతోషముతో) నాథా! నాథా! ఇదుగో! ఈవైపుఁజూడుడు. మనమేదోయని భ్రమించితిమి.ఇదియొక బంగరులేడి. ఆహాహా!

గీ॥ వజ్రవైడూర్య మాణిక్య । నఖులుఁగూర్చి
శిల్పి కనుపించు నేర్పుఁజూప । చిత్రగతిని
జీవప్రతిమగఁ జేసి సృ । ష్టించినట్టుల
నాడుచున్నది హరిణము । యౌర! సొబగు!

రాము—ఓహో! మరల నదృశ్యమైనదే!

సీత—లేదు. ఆపొదరిండ్లచాటున మేతమేయుచు, దిక్కులు భ్రమించునట్టుల బెదరిబెదరి చూచుచున్నది. ఆహా? ఏమాసుందరము?

(అనుబంధము 13)

రాము—అవును. అరరే! ఏమిదాని గమనవిలాసము? ఆహా! ఇట్టి విచిత్రసారంగము నిదివఱకెన్నండునుఁజూచి యుండలేదుగదా!

సీత—ప్రాణేశ్వరా! ఆయేణముతో నాడుకొనవలయునని మిక్కిలి కుతూహలముగనున్నది. దానినిఁబట్టుకొని నాకప్పగింపుఁడు.

రాము—దేవీ! అదెంత భాగ్యము? (అనుబంధము 14)

సీత—నాథా! అది చిక్కకున్న, నారాచమున బడఁగూల్చి, దాని చర్మమైనఁ గొని తేవలయును.

రాము—అట్లే యొనర్చెదను. తమ్ముఁడా! లక్ష్మణా! ఆకనంబను మృగోత్తమమును బట్టియిమ్మని మీవదినె కోరుచున్నది. ధనుర్బాణము లిటు దెమ్ము. దానినిఁగొనివచ్చెద.

లక్ష్మ—అన్నయ్యా! ఆకనకసారంగముఁజూడనా కనుమానమయ్యెడిని.

గీ॥ కనకమృగమును మనమెప్డుఁ । గాంచలేదు
లేరు, మునుఁజూచియున్నట్టి । వారుఁగాని
రాక్షసావృతమైన య । రణ్యమగుట
మాయగాఁ దోఁచుచున్నది । మనుకులేంద్ర!॥

రాము—లక్ష్మణా! ఇదంతయు దానవభూమియైనను, మాయానిర్మితమృగము లేల విజృంభించియుండును?

లక్ష్మ—అన్నా! అదేమిమాయయోగాని, యీకనకమృగము లోకవిరుద్ధమగుట సంశయాస్పదముగ నున్నది. (అనుబంధము 15)

రాము—సోదరా! నీవనినట్లు లీమృగము రాక్షసమాయాకల్పితమే యైనచో.

(అనుబంధము 16)

ఉ॥ ఈ మృగముం సురారులు సృ । జించి భ్రమింపఁగఁ జేసియున్నచో
తామసమూర్తి బాణమున । ధారుణిఁ ద్రెళ్ళఁగఁ జేతు సంయమి
స్తోమములుల్లసిల్ల; నటఁ । దోడ్కొనివచ్చెద దానిచర్మముం
భూమిజకోర్కెఁ దీర; నిదె । పోయెద బాణములిమ్ము తమ్ముఁడా!॥

(చేయిఁ జాచును)

లక్ష్మ—(స్వగతము) అకటా! సర్వజ్ఞుఁడగు నీమహానుభావుఁడు భార్యకోరికఁ దీర్పవలయునను భ్రాంతిచే, మాయామోహితుఁడగుచున్నవాఁడు. వారియాజ్ఞ దాటఁ జాలను. కానిమ్ము. దైవమే గలఁడు.
(బాణములొసంగును.)

రాము—(అందుకొని) లక్ష్మణా! నేవచ్చుదనుక జానకి నప్రమత్తుఁడవై జూచుచుండుము. నేఁబోయివచ్చెదను. (నిష్క్రమించును.)

లక్ష్మ—అమ్మా! అది మాయామృగంబుగాని, వేఱుగాదు.

సీత—మఱఁది. కిప్పుడక్లే తోఁచుచున్నది. ఆలేడియెంత దవ్వోగనో? నాథుఁడిం కను రాకున్నవాఁడు. నాహృదయమేలనో వికలమగుచున్నది.

లక్ష్మ—అమ్మా! వైకల్యమేల? అది మాయామృగంబేనైనను, మదగ్రజుని వింటికి కసాధ్యంబుఁగలదా?

(తెరలో) హా లక్ష్మణా! సీతా!

సీత—(భయముతో) హా! చచ్చితి. అయ్యో? నాథా! నీకేమి యాపదవాటిల్లినది? మఱఁది! లక్ష్మణా! ఇంకేమున్నది? మీయన్నగారు రాక్షసమాయాకృతమునఁ జిక్కి విలపించుచున్నారు. పొమ్ము. లక్ష్మణా! వేగముపొమ్ము. అన్నగారికి నీచేయూతయిచ్చి వెంటఁ గొనిరమ్ము. పొమ్ము. ఆలసింపకుము. (అనుబంధము 17)

లక్ష్మ—అమ్మా! భయపడకుము. మాయన్నకే యశుభమును గలుగదు. ఆ వికృతస్వరముఁగూడ రాక్షసమాయఁగాని తదన్యముఁగాదు. ఊరడిల్లుము.

సీత—అయ్యో? లక్ష్మణా! నాకేల సమాధానముఁ జెప్పెదవు? విపత్సాగరమందున్న మీయన్నగారికి సహాయముఁ జేయఁబొమ్ము. నసువుము. అది మీయన్నగారి కంఠస్వరమే.

లక్ష్మ—జననీ! ఏల యీలీల దుఃఖమున భీతిల్లెదవు? భయముడుగుము.

సీ॥ విలయకాలానల । జ్వలితయై తాటకాం
గన నడంచిన విల । క్షణబలుండు
దేవదానవుల నిం । దించిన హరచాప
మును రెంపుఁ జేసిన । భూరి భుజుఁడు
వసుధరాట్చక్ర సం । వర్తి భార్గవురాము
గర్వంబుఁదూల్చిన । ఘనయశుండు
ఖరదూషణాదిరా । క్షసకోటినొక్కఁడే
నీటడఁగించిన । కృతకరుండు

గీ॥ ఎలమిముక్కోటిదేవత । లెత్తివచ్చి
రణమొనర్చిన, గాధినం । దన వరప్రి
సాదలబ్ధ తశస్త్రాస్త్ర । సాధనుఁడగు
రామునింగెల్వఁజాలరా । యమ్మతల్లీ!॥

ఇదియునుంగాక.

గీ॥ భూమికంపించు, దిక్చక్ర । ములు వడంకు
వనధులుప్పొంగు, ప్రళయాగ్ని । ప్రజ్వరిల్లు
కమలమిత్రుండు, జలజారి । గతులుదప్పుఁ
గానలేయున కాపదఁ । గలుగఁదల్లి !॥

సీత—ఓయీ! ఏమి నీ గాంభీర్యోపన్యాసము? అన్నగారాపదఁజిక్కి యల్లాడుచుండ వదినకు సుద్దులుఁజెప్పుచుంటివా? నిజముగ నన్నగారి మేలుఁగోరెడి తమ్ములు లేరనుట నేటికిఁ దెల్లమైనది. నిన్ననవలసినఁ బనియేమి? హా! నాథా! లక్ష్మణుఁ డేకగర్భసంజనితుఁడైనచో నీయార్తనాదమాలించి నిన్ను రక్షింపకూరకుండునా?

లక్ష్మ—తల్లీ! ఎట్టిమాటలాడితివమ్మా! మిమ్ముఁ దలిదండ్రులవలెఁ బూజించినందులకిదియా ఫలము! నిన్ను విడిచిపోరాదని నీనాథుఁడాజ్ఞాపించుటచే, వెడలుటకు సంశయించుచుంటినిగాని వేఱుగాదు. అగ్రజుని యనుజ్ఞాపాశ బంధితుఁడనగు నన్నీ నకారణముగ దూరుట న్యాయమా తల్లీ!

సీత—ఛీ! ఛీ! పాపసంభవా! నీ దురభిప్రాయమంతయు నేటికిఁ దెల్లమైనది. భరతుఁడు రాజ్యాదులు హరించి యరణ్యములకుఁ దోలినాఁడు. నీవు నీయగ్రజుని మరణానంతరము నటకు వేచియుండి నాకపకారము సేయుచున్నావు. దురాత్మా! ఇక్ష్వాకుకుల కళంకా! నీమొగముఁ జూడరాదు. నాయెదుటనుండి తొలఁగిపొమ్ము. మాగతులెల్ల తెల్లవారకున్నవో భగవంతుఁడే కలఁడు. పాపాత్మా! వెడలిపొమ్ము.

లక్ష్మ—(చెవులు మూసికొని) హరిహరీ! హా! సాధ్వీమతల్లీ! ములుకులవంటి నీపలుకులు నాహృదయకోశమును జీల్చివేయుచున్నవి. నీయాజ్ఞఁ బాలింప నేనిదే పోవుచున్నాఁడను. బ్రహ్మాదిదేవతలే నీకింక రక్షణమగుఁగాక. జననీ! నీవుమాత్రమీ గిరిదాటిరాకుము. నేఁబోవుచున్నాను. (ముందుకు వచ్చి దిశలఁబరికించి)

సీ॥ సాకేతపురలక్ష్మి । సాధుల వరలక్ష్మిఁ
గావరే తాపస । గణములార!
రవికుల చిన్నారి । రాముని దేవేరి
నేలరే యష్టది । క్పాలులార!

సద్గుణ సంపత్తి । జనకుని వరపుత్రిఁ
గృపఁజూడరే వన్య । మృగములార!
యజన సంభవదేవి । ఋజుమార్గములదీవిఁ
బ్రోవరే సత్పుణ్య । పురుషులార!
గీ॥ దశరథేశుని కోడలు । ధర్మనిరత
సరసి రక్షింపరే వన । తరువులార!
నిత్యకల్యాణి, శుకవాణి । నీలవేణి
జానకిని నోముఁడీ; రవి । చంద్రులార॥

అనుబంధము. 18) (నిష్క్రమించును.)

సీత—తోడుగానున్న లక్ష్మణుని దుర్భాషలాడి వెడలనడిపితిని. ప్రకృతి భయ పిశాచియై నాహృదయ కమలమును కంపించుచున్నది. అయ్యో! ఆపాడు లేడి నేఁడేల నాకంటఁబడవలెను? పట్టి తెమ్మని పతినేలఁ బంపవలయు? (ఉలికిపడి) అకటా! నేఁడేమి కీడుమూడ నున్నదోగాని నా దక్షిణ నేత్రమదురు చున్నది. ఇంక నా కెద్ది శరణ్యము?

(సన్యాసివేషముతో రావణుఁడు ప్రవేశము.)

రావ—హరహర! మహాదేవశంభో!.

సీత—ఎవరో మహానుభావు లిటు వచ్చుచున్నారు. (చూచి) మహాత్మా! వందనములు.

రావ—కల్యాణమస్తు.

సీత—దేవా? అందధిష్ఠింపుఁడు.

రావ—(కూర్చుని) కాంతామణీ! ఘోరకాంతారమున నొంటివై, నీవిట్లుండుట కేమి కారణము? నీవెవరవు? నీవొక రాజకుమారివలె గనిపించుచున్నావు, నీ యుదంతమేమి?

సీత—మహానుభావా! అవధరింపుఁడు.

సీ॥ బుధ విధేయుఁడు, జగ । త్పుణ్యతపోరాశి
జనకరాజేంద్రుఁడు । జనకుఁడయ్య!
అఖిల లోకములకు । నారాధ్య భగవతి
దిక్చక్రవ్యాప్త భూ । దేవితల్లి

ఖర దూషణాది రా । క్షస నిషూదనుఁడర్క
వంశోద్భవుండు నా । ప్రాణవిభుఁడు
చెలఁగి, శూర్పణ ముక్కు । చెవులు గ్రక్కరవాల
మునఁగోసినట్టి ల । క్ష్మణుఁడు మఱఁది॥

గీ॥ తండ్రి యాజ్ఞను బాలింప । దాశరథులు
వనులఁ జేరిరి కార్ముక । పాణులగుచు
పాపులనడంచి, సజ్జన । పాలనంబు
సేయుచున్నారు; నా పేరు । సీతయండ్రు॥

రావ—వారిరువు రెందున్నారు?

సీత—ఇంతకుముందు వారొక హరిణంబును తఱుముకొనుచు దవ్వులం జనిరి. ముహూర్త మాత్రమున వారరుదెంచి మిమ్ము సపర్యాసంతృప్తులం జేయఁగలరు.

రావ— ఓ వెఱ్ఱిబాగులదానా!

ఉ॥ హాయిగ భర్మహర్మ్యముల । యందుఁ జరింపగ నర్హమైన నీ
ప్రాయమునే గణింపక న । రణ్యముఁ జేర్చినవాఁ డసూ పశు
ప్రాయుఁడుఁగాక మర్త్యుఁడొకొ? । పాపము! నీయవివేకమెంతయున్
బాయక, వెంటవచ్చితివి । భర్తయటంచును నమ్మి వెఱ్ఱివై॥

ఓ తుహినాంశు వదనా! నిన్నుఁ జూడ నాకెంతయు విచారమగుచున్నది గదా!

సీ॥ పరిపూర్ణచంద్రుని । పరిహసించెడి మోము
యెండ వేడిమికి స । హించు టెట్లు?
యుద్యాన వనసీమ । నొచ్చు నీపాదాలు
యుగ్రాటవిఁ జరింప । నోర్చు టెట్లు?
స్వచ్ఛమౌ పన్నీట । జలకమార్చెడి కురు
లద్రికుల్యలఁ దీర్థ । మాడు టెట్లు?
విద్యుల్లతాకాంతి భ్ర । మించు నీమైదీగ
సుడివారు వడగాడ్పు । సోకు టెట్లు?

గీ॥ డెందమలరఁగ సుందర । మందిరముల
సౌఖ్యములఁ బొద్దు పుచ్చఁగ । జనెడు నీవు

# తృతీయాంకము.

గిరులయందు వనాటవి । ఝురులయందుఁ
గాపురంబా కుటింటనా? । కలికిమిన్న !॥

సీత—మహాత్మా! మీ కెఱుఁగని ధర్మములు లేవు. సతులకు పతియే పరబ్రహ్మ ముఁగదా!

రావ—నారీమణీ! నీవంటి సుందరాంగిని దండకాటవికిఁ గొనివచ్చి, కందమూలాదులుఁ గుడువఁబెట్టుచుఁ, గరకు రానేల నిద్రింపఁజేయుచున్న పతి, సతికెట్టుల పరబ్రహ్మమగును? అతిసుఖప్రదముగ సతుల నాదరించిన పతియే పరబ్రహ్మము. కట్ట గుడ్డలేక గుట్టలఁబట్టించిన పతియే దైవ స్వరూపమని నమ్మి, నవయౌవనము నట్టడవి పాలుఁగావించుచున్నందులకు, నీ వెఱ్ఱితనమే కారణము సుమా?

సీత—అయ్యా! లోకజ్ఞులగు మీరే యిట్లుఁబలికిన నేనేమనఁగలను? ఒకవేళ, మీరు నాచిత్తవృత్తి నరయుటకై యిట్లు వాక్రుచ్చి యుందురా?

రావ—(స్వగతము) ఈమెతో ముచ్చటింపుచుఁ గూరుచున్న ప్రమాదము వాటిల్లును గాన, త్వరపడవలయును. (ప్రకాశముగ) రామాంగీ! నీవు నాయభిప్రాయముఁ జక్కఁగ నెఱింగితివి. మఱికొంతసేపు నీతో ముచ్చటింపఁ దలంచితినిగాని, యిప్పటికే కాలాతీతమైనది. భిక్షనొసంగెదవా?

సీత—చిత్తము. (కందమూలములు బుచ్చుకొని) దేవా! ఇవి గైకొనుఁడు. (ఈయఁబోవును.)

రావ—రమణీ! నేనీభిక్షకై వచ్చినవాఁడఁగాను.

సీత—దేవా! మాకడ నింతకన్న నధికము లేముండును?

రావ—ఉన్న పదార్థములయం దొకదాని నడిగెదను. ఇచ్చెదవా?

సీత—(తనలో) ఈయన యేమికోరునో గదా?

రావ—అనుమానించెద వేల?

సీత—మఱేమియు లేదు. మీయభీష్ట మెఱింగింపుఁడు?

రావ—చెలీ! నీకృపాభిక్షువు.

సీత—హరిహరీ! తాపసులగు మీ రిట్లనఁజెల్లునా?

రావ—రాజరేఖాభిరామా! మహిళాలలామా! చల్లకువచ్చి ముంత దాచనేల? నాప్రవృత్తి వినుము.

సీ॥ పద్మసంభవుని త । పంబునఁ మెప్పించి,
వరములుఁ గొంటి న । వ్వారిగాఁగ
కైలాసగిరి భుజ । కండూతిచే నెత్తి
వడఁకించి తీశ్వరీ । వల్లభులను
అష్టదిక్పాలుర । నాహవంబునఁ దోలి
స్వర్గపురంబుఁ జేఁ । బట్టినాఁడ
సురగరుడోర్గ కి । న్నర సిద్ధసాధ్యాది
బిబ్బోకవతులునా । పీటనుందుర్
గీ॥ మూఁడులోకములను నేఁ బర్ । భుండనగుట
ననిలుఁ, డనలుండు, యముఁడు, జం । ద్రార్కు లెలమి
వెఱచి వర్తింతు రెపుడు నా । పేరువిన్న
రమణి! లంకాధినాథుఁడ । రావణుండ॥

(నిజస్వరూపుఁ డగును)

సీత—(భయవిహ్వలయై) హా! రామా! రామా! (మూర్ఛిల్లును)

రావ—నా నిజస్వరూపముఁ జూచి భీతిల్లి నట్లున్నది. మేలుకొలిపెదఁ గాక. (దూరమునసుండి) సీతా! సీతా! (చప్పటులుఁ గొట్టును)

సీత—(లేచి భయభ్రాంతయై నిలువఁబడి కోపముతో) రావణా! కామాంధకారచిత్తుఁడవై నాకపకారము సేయ సాహసింపకుము. దైత్యవిరాముఁడగు దశరథరాముఁడు నీయకార్యము విన్న చో, నీదశవక్త్రనాళములుఁ జెల్చి వేయును. బుద్ధిఁ దెచ్చుకొని వెడలిపొమ్ము.

(అనుబంధము 19)

రావ—రూపసుందరీ! శతయోజన విస్తీర్ణమగు లంకానగరము దాఁటి, తొల్లి నీస్వయంవరమునకు వచ్చి పరాభవింపఁబడి మగిడి పురోన్ముఖుఁడ నైతిని. నాఁటి నుండి నాయాశాబీజము మొలకయెత్తి నేఁటివఱకు చిగుర్చుచున్నది. "కష్టే ఫలీ" యనునట్టుల, నింతకాలమునకు నీసందర్శనప్రాప్తి గలిగినది. నిన్నొంటరిగఁ జిక్కించుకొని పోవఁదలంచియే, మాయామృగమును సృజించి, రామలక్ష్మణులఁ గడుదూరమున కీడ్చుకొని పోయితిని. నీవింక మారుపలుకక నావెంట లంకాపురమ్మునకు రమ్ము. రాముఁడు గీముఁడని కాలయాపన సేయకుము.

సీత—ఓరీ! దుష్టనిశాటా! నీకు మరణకాల మాసన్న మగుటచేతనే నన్నుఁ జెఱఁ
బట్టనెంచితివి. తొల్లి రామబాణాగ్నిలో మిడుతల దండువలె నీకులీనులెం
దరు గతించిరో తెలియదా? కామోద్రేకమున మఱచితివి కాఁబోలు!

గీ॥ తాటక సుబాహులేగిన । దారిఁ బోకు
దూషణ విరాధులరిగిన । త్రోవఁ జనకు
బ్రతుకఁ గష్టి నాసఁగలదేని । పాఱిపొమ్ము
ఘోర దనుజవిరాముని । బారిఁ బడక॥

రావ—సీతా! బక్కరక్కసులఁ జంపిన బడుగురాముఁడు, బ్రహ్మాండనాయకుఁడగు
రావణునిముందు తృణప్రాయముసుమీ! చతుర్దశభువనము లొక్కపెట్టున
నెత్తివచ్చినను నిన్నుమాత్ర మింక నాబారినుండి సంరక్షింపఁజాలరు. వే
యేల?

గీ॥ రామ! నీరామచంద్రుఁడు । రాకమున్నె
చండదోస్స్ఫారమద్భుజా । శక్తిఁ దెలియఁ
బర్ణశాలఁ బెకల్చి, ని । ర్భయముగాను
చనెద నిన్ గొని యీరథం । బుననె కనుమ॥

(కట్టెదుట నరథ మొండు ప్రత్యక్షమగును)

సీత—హా! నాకింకేమిగతి? అయ్యో! ఇదెక్కడి మాయరథము? హా పరమేశ్వ
రా! నీవయిన నన్నీ యాపదనుండి రక్షింపరాదా?

సీ॥ దేవాదిదేవున । కీవార్తఁ దెల్పరే
వనవాస తాపస । వర్యులార!
తరణి వంశజున । కీ దురవస్థఁ దెల్పరే
యనిశంబుగహన వి । హారులార!
దుష్టశిక్షణున । కీ దుస్థితిఁ దెల్పరే
త్రిజగదారాధ్యులా । దేవులార!
కౌసల్యసుతున । కీ కష్టంబుఁ దెల్పరే
ముక్కోటిదేవతా । ముఖ్యులార!

గీ॥ పంచవటి! చెప్పఁగదవె నా । ప్రాణపతికి;
తల్లి! గోదావరీ! నీవు । దయవహింపు;

సంస్తుతించెద, రాముల । తమ్ముఁడుల జీరి
సతిని రక్షింపఁజూడరె । స్వాములార !॥

(మూర్ఛిల్లును)

యవనికజారును.

---

చతుర్థదృశ్యము—అరణ్యము.

లక్ష్మ—(ప్రవేశించి తెరనంకఁజూచి) అకటా ! సీతాదురవస్థఁ జూడఁజాలనుకదా ! మారీచ మథనుఁడగు శ్రీరాముఁడు సీతమ్మతల్లిసింగానక, కంటఁబడిన ప్రతివస్తువును సీతాదేవిగా భ్రమించి, దుఃఖార్ణవమున మునుఁగుచున్నవాఁడు. దుర్నివార దుఃఖాతిరేకమున నన్నెఱుఁగక, కేవలము వెఱ్ఱివాఁడై శోకాకులితచిత్తుఁడై యిటె వచ్చుచున్నాఁడు.

రాముఁడు—(ప్రవేశించి)

అనుబంధము.

లక్ష్మ—మారీచమథనా ! రఘుకులాభరణ ! సీతారమణ ! ఇదంతయు వింధ్యనగ మహారణ్యము. అవిగోకంటకాన్వితమార్గములు. ఇటు దయచేయుఁడు.

రాము—(వినిపించుకొనక)

సీ॥ ఓమయూరములార ! । రాముదేవేరిని
దర్శించితిరె ? ధరా । ధరములందు
రాచిలుకములార ! । రఘువంశ్యుఁగోడలఁ
గాంచియున్నారె ? సై । కతములందు
వానకోవెలలార ! । జానకీదేవినిఁ
గంటిరే ? భయద దు । ర్గములయందు
వనమృగేంద్రములార ! । జనకరాట్పుత్రిక
నరయరే ? భూరిగ । హ్వరములందు
గీ॥ సతిని వీక్షింపరు గద ? యే । చక్కినైన
నెలమి నడవులఁదిరుగు ము । నీంద్రులార !
సుగుణమణిఁగానరుగద ? యె । చ్చోటనైన
నాకసంబునఁ దిరుగుచు । న్నారులార !॥

హా ! నేనెంత పాపకర్ముండను ? నాయార్తనాద మాలకింపవా రొక్కరు

లేరా ? స్వయంవరమంటపమున కుసుమకోమల కరపల్లవములతోఁ
బుష్పహారము గీలించి, చిరునవ్వుమొగంబున నాగళసీమ నలంకరిం
చినసీత, అరమోడ్పు కన్నుఁగవతో ముద్దుమొగంబుఁ బైకెత్తి ముత్తి
యములు దోసిటఁబట్టి నానెత్తిన తలంబ్రాలుఁబోసిన భూజాత, సుర
మర్త్యలోకాంగనల సుందరత్వ మపహరించి, యయోనిజయై భూమి నవ
తరించిన సకలసౌభాగ్యాభిశోభిత, రాజ్యాదిభోగభాగ్యములు సరకుసేయక
నారచీరలు గట్టి, నట్టడవుల నావెంట గుట్టలెక్కుచు, బతివ్రతాధర్మములు
స్థిరస్థాయిగ నెలకొల్పిన నిష్కళంకచరిత, నాకర్ధాంగియై, రఘుకులాన్వయ
కీర్తిచంద్రికలు భూనభోంతరాళముల నిబిడీకృతముఁ గావించిన సాధుసద్గు
ణాలంకృత, సర్వభూతదయోపేత, నిఖిలజగన్మాత, బుధవినుత, నాసీత.
హా! అట్టి సీతావియోగమును నేనీజన్మమున భరింపఁగలనా? భరింపఁజాలను.
మొండినై బ్రతుకఁజాలను. (నిట్టూర్పువిడిచి) హా! ప్రాణేశ్వరీ! మదాజ్ఞాను
వర్తీ! క్షణకాలమైన మద్వియోగమును సహింపఁజాలని నీవు నన్నీడనాడి
యెందరిగియుంటివి? నన్నుఁ బరీక్షింప నీప్రాంతముల నెందైన దాగియుంటి
వా? దాగియున్నచో పరిహాసమున కిది యదనుగాదుసుమా! సుధాంశుమండ
లమున కెనయగు, నీవదనేందుదర్శన మిచ్చి నావియోగాగ్నిఁ జల్లార్పుము.
ఏమంటివి? పలుకకుంటివా? నాపైనీకుఁ గనికరము లేదా? అయ్యో! జీవితేశ్వరీ!
నీహృదయము పాషాణసదృశమని నేనెన్నఁ దెలుంగను గదా! కాదు. కాదు.
నేనే పొరఁబడుచుంటిని. నాయర్ధాంగిహృదయము కుసుమకోమలము, నిష్క
ల్మషము, దయాపరిపూరితము. అట్టి నాయర్ధాంగిలక్ష్మి!, నాజీవితానంద
చంద్రిక, నాకోరికలప్రోవు, నామురిపెంపుటన్ను, నామనోధనము, నాసీత,
నాయెడ నింత నిర్దయవహించుట కల్ల. హా! జానకీ! నీ వేదుష్టమృగముల
పాలైతివో? యేరక్కసుల మాయావ్యూహములఁ జిక్కుకొంటివో? ఏమైపో
యితివో? యెఱుంగఁజాలనుగదా! (కొంచెమూరకొండి) అదిగో! ఆకోకిలస్వ
రము నాసీతకంఠమే. పోయిచూచెదఁగాక (లేచిపోయి వృక్షమువైపుఁజూచు
చుండును.)

లక్ష్మ—అన్నయ్యా! అదంతయు మీచిత్తవిభ్రమము. అదియొకకోకిల.

రాము—ఛీ! దుష్టకోకిలా! నీవు నన్నెంతయు మోసగించితివిగదా!! నీవుపలుగాకివి. నీముఖముఁ జూడరాదు. (వెనుదిరిగి) ఆహా! అల్లదే యాపూపొదరిండ్ల నాప్రియసి మెఱుఁగులీను తనచూపుఁదూపు లపారముగ నాపై బఱపుచున్నది. పోయి దర్శించెదఁగాక. (పోఁ బోవును.)

లక్ష్మ—(అడ్డమునిలిచి) ఆర్యా! అదియొక హరిణశాబకము.

రాము—ఛీ! ఛీ! హరిణాధమా! ఇంక నీకులమును విశ్వసింపరాదు. తొల్లింటివలె నేఁడుగూడ నన్నెంత భ్రమింపఁ జేసితివే? నీ వతిపాపివి. నీవదనసందర్శనమే మహాపాతకము. ఆవలకుఁబొమ్ము. (వేఱొకదెసఁ జూచి) అల్లదే! ఆవినీల కుంతల నాసీతయే. (పోవుచుండును.)

లక్ష్మ—రామచంద్రా! మీ కిదియేమివెఱ్ఱి? అదినెమలిసుమా!

రాము—ఓదుష్టమయూరమా! నన్నెంత మోసగించితివే? నీవు నిరంతరము విషసర్పభోజనగుటచే స్వబుద్ధినిఁ జూపించుకొన్న నిన్ను వీక్షింపరాదు. తొలఁగి చనుము. (మఱియొకవంకఁ జూచి) అహాహా! నేనెంతయు ధన్యుండను. ఆలతానికుంజములచాటుననుండి, నాసతి, నాకఁ జేసన్నఁ జేయుచున్నది. (పోవుచుండును.)

లక్ష్మ—అగ్రజా! అది మాధవీలతసుమా?

రాము—ఓమాయాలతా! సీతావియోగమునఁ బరితపించు నేనా నీకు హాస్యపాత్రి యుండనైతిని. చూడుము. నిన్నేమిచేసెదనో? (లతను దుంచివేసి) అకట కటా? భ్రమాకులితచేతస్కుఁడనై సర్వము సీతామయముగాఁ దోప వెఱ్ఱి నగుచున్నాను. అయ్యో! నావియోగమున కింకదరిలేదా? నాప్రియామణీ సందర్శనభాగ్యమింక లేదా? నాజీవిత మింక గాఢాంధకారబంధురమునఁ జిక్కియల్లాడవలసినదేనా? పరోపకారపారీణుండనగు నామొఱాలించి, నాప్రియామణిఁ జాడనెఱింగించు పుణ్యాత్ము లొక్కరైననలేరా? హా! రాకాశశాంకవదనా! హా! పరాజితగంధగజేంద్రగమనా! హా! మదీయపూర్వకృతపుణ్యభాగ్యరాశి, హా! మనుకులవంశకీర్తిచంద్రిక! హా, భూజాతా, హా సీతా! సీతా! (అని మూర్ఛిల్లును.)

లక్ష్మ—అకటా! భార్యావియోగజనిత దుఃఖాతిరేకమున నాయనుజుఁడిట్లుమూర్ఛాక్రాంతుఁడై యుండ, నసమర్థుఁడనై నే నిట్లూరకుండవలసివచ్చెనుగా? హా!

మాలదైవమా! మేము నీకేమిహానిఁ జేసితిమని యిట్లు బాధించుచుంటివి! (విచారించి) నెమ్మదిగ నేదఁ దీర్చెదఁ గాక (రామునిఁ జేరి) అన్నా! రామ చంద్రా!

రాము—(కన్నులువిచ్చి) ఎవరునీవు?

లక్ష్మ—నేను నీసోదరుఁడను.

రాము—నాసోదరుఁడవా? నీనామ మేమి?

లక్ష్మ—అయ్యో! నాపేరు లక్ష్మణుఁడు గాదా?

రాము—మంచిది. నీయన్న రాముఁడేడి?

లక్ష్మ—రామచంద్రా! సాధ్వీవియోగమున నిన్ను నీవేమఱచితివా? నీవు రాముఁడవు కావా?

రాము—అవును. నేనే రాముఁడను. నాసీత యేది?

లక్ష్మ—ఆయమ్మజాడ తెలియక నేగదా?

రాము—హా! సీతా! సీతా! (మరల మూర్ఛిల్లును.)

లక్ష్మ—ఆర్యుఁడు శైత్యోపచారములఁగాని స్థిరచిత్తుఁడు కానేరఁడు. (అట్లు లజేయు చుండును.)

రాము—(తత్తరపాటుతో లేచి) హా! సీతా! ఆగు మాగుము. (లక్ష్మణుని కౌగిలించుకొనును.)

లక్ష్మ—అన్నయ్యా? నేను నీతమ్ముఁడ. లక్ష్మణుఁడ.

రాము—(తెల్లపోయి వానిని విడిచి) హా! ప్రియామణీ! నీవు గానరాకుండుటచే రాముఁడు కేవలము వెఱ్ఱివాఁడగుచున్నాఁడు. ఏమిగతి?

లక్ష్మ—దేవా! మనకిప్పుడు సీతాన్వేషణమే శరణ్యము. కూరీవియోగమునుండి మరలినఁగాని కర్తవ్యములేదు. సర్వజ్ఞులగు మీరిట్లు శోకించుచున్నఁ బ్రయోజనమేమి?

ఉ॥ కాలవశంబునంగలుగు । కష్టపరంపరలందు ధైర్యమున్
దూలి, విషాదకూపమున । దోగును వ్యర్థుఁడజస్రమున్;విప
త్కాలమునందు డీల్పడక । ధైర్యముఁ బాయక ధీరచిత్తుఁడై
తాలిమిఁ బూని మేల్పడయుఁ । దప్పక నెంతయుఁ బ్రాజ్ఞుఁ డిమ్మహిన్.

రాము—తమ్ముఁడా! నిజమువచించితివి.వికలచిత్తుఁడనై, కర్తవ్యతామూఢుఁడనైన నాకిప్పుడు కర్తవ్య ముపదేశింపుము.

లక్ష్మ—అన్నా! సీతాన్వేషణమునకింకెట్టి గత్యన్య మొరఁగు లేదు.

రాము—మంచిది. దారిఁజూతము. (లేచును.)

లక్ష్మ—అగ్రజా! ఇటు దయచేయుఁడు. (వెంటనిడుకొని నిష్క్రమణము.)

---

పంచమదృశ్యము—అరణ్యమార్గము.

[ఱెక్కలు తెగిపడియున్న జటాయువువద్ద శ్రీరామలక్ష్మణులు నిలువఁబడియుందురు.]

జటా—శ్రీరామచంద్రా! రావణాసురాపహృతయై దెసలాక్రందనము సేయుచు, రథమున్పై నరుగుచున్న సీతామతల్లిని, చెఱనుండి విముక్తిఁ జేయఁదలఁచి, నేనాలంకాధిపతియగు దశకంఠునితోఁ ముఖాముఖిగఁ బోరాడి, తుదకిట్లు ఱెక్కలు తెగి నేలఁగూలి, కడప్రాణంబున మీరాకకై వేఁచియున్నాఁడను. నా పేరు జటాయువు.

రాము—హా! పక్షికులేంద్రా! ఉపకారమునకుఁబోవ నపకారమేగాక, ప్రాణావసానకాలముఁగూడ నీకు ప్రాప్తించెనా? తమ్ముఁడా! చూచితివా! కాలవైపరీత్యము?

గీ॥ పాపకృత్యము లొనరించు । వాని కందు
నెట్టిదుర్గతులునుఁగల్గ । వీజగాన;
పుణ్యకార్యము లొనరింపఁ । బోవువాని-
కాపదలును, ప్రాణాపాయ । మయ్యెనవని॥

లక్ష్మ—అగ్రజా! నిజము వచించితిరి.

జటా—ఆర్యులారా! నేనింక బ్రతుకను. లోకమంతయు నంధకారమైనది. నారాయణ! నారాయణ! (ప్రాణము విడుచును.)

లక్ష్మ—అన్నా! ఇతండు మరణించినటులున్నది?

రాము—అవును. మననిమిత్తము ప్రాణములఁ గోలుపోయిన వీనికగ్నిసంస్కారముఁ జేయవలయును. ఈతఁడు నావలనసత్కృతుఁడై పుణ్యలోకమున కేఁగఁగలఁడు. నీవింక పరికరముల సిద్ధఁబఱుపుము. క్రియలు జరిపెదము.

లక్ష్మ—చిత్తము.

(యవనిక జారును.)

---



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సంపూర్ణ రామాయణము

## చతుర్థాంకము

ప్రథమదృశ్యము—ఋశ్యమూకము.

[రామలక్ష్మణ సుగ్రీవాంజనేయులు ప్రవేశము.]

లక్ష్మ—అగ్రజా! ఈతఁడెంతయు వనచరోత్తముఁడై, స్నేహపాత్రుఁడైనట్లుఁ దోచుచున్నది.

సుగ్రీ—(చేతులుజోడించుకొని) మహాత్ములారా! రామలక్ష్మణులారా!

గీ॥ నాపురాకృత పూర్వపు।ణ్యంబువలనఁ
బూజ్యులగుమిమ్ము దర్శింపఁ। బుణ్యమొదవె
నాచరిత్రము వినిపించి। నాడఁగాన
యభయమొసఁగిన నాభయ। మంతరించు॥

రాము—సుగ్రీవా! దుస్సహజాయావియోగజనితవిషాదహృదయుండ నయ్యు; నీచెలిమివలన నొకింత యూఱటకుఁ గారణమయ్యె. నీవింక ధన్యుండవు సుమా!

సుగ్రీ—నాధన్యత్వము, వాలివధానంతరమునఁ గదా?

రాము—అవును. అందులకు సందియమేమి?

ఆంజ—శ్రీరామచంద్రా! సుగ్రీవుని సందేహ మదికాదు. వాలి, దేవాసురులకేని దుర్జయుఁడు.

సుగ్రీ—దేవా! త్రిభువనములయందు వానిని జయించెడి బాహుశాలి నింతవఱకుఁ జూచియుండని కారణమున-

రాము—ప్లవంగ శేఖరా! సుగ్రీవా! నీవేల సంశయించెదవు?

ఉ॥ గంధగజేంద్రు నింపగిది । కామవికార విహారుఁడైన గ
ర్వాంధుని, వాలినుగ్రశర । జాహవమందు సురల్ నుతింపఁగా
బంధురశక్త మద్విశిఖ । బాణముతో హృదయంబు జీల్చి, కి
ష్కింధ పురాధినాథునిఁగఁ । జేసెదనిన్నుఁ గపీ సూర్యనందనా॥

(చేతిలోఁ జేయి వైచును.)

సుగ్రీ—మహాత్మా! గంభీరోత్సాహముగు మీయభయ దానమువలన నేనిప్పటికిఁ గృతార్థుఁడనైతిని. కాని, యల్పుఁడనగుటచే మఱియొక సందియము నన్ను బాధించుచున్నది. (హనుమంతునికి సైగఁజేయును.)

రాము—సుగ్రీవా! అదేమొ చెప్పుము.

ఆంజ—ఆర్యోత్తమా! పురందరపుత్రుఁడగు వాలి యసాధ్యుఁడు. ఆతఁడీ దుందుభికంకాళమునంట మునుశిలోచ్చయము నెత్తివిసరివేయ యోజనముదూరము వచ్చిపడినది. మీరు వీరపరాక్రమసింహులగుట నీశిలోచ్చయముఁ దాటవేయుట సమంజసము కాదేమోయని సుగ్రీవుని యనుమానము.

రాము—ఆంజనేయా! ఓయీసుగ్రీవా! వాలికరస్పర్శనమున మలినమైన దీనిని నాపాదాంగుష్ఠముతో విసరివేసెదఁ జూడుము! (మీటును)

హను—సుగ్రీవా రాజా! చూచితివా?

సుగ్రీ—రామచంద్రా! మీపాదాంగుష్ఠమున విసరుటచే బదియోజనము త[illegible]మ్మినది. ఇఁక నాకెందునుఁ గొఱంతలేదు. నేనిదే పోయి వాలిని రణరంగమునకుఁ దోడ్కొని వచ్చెదను. హనుమా! పోవుదము రమ్ము.

రాము—పోయిరండు.

హను—
సుగ్రీ— } చిత్తము.

(నిష్క్రమింతురు.)

రాము—లక్ష్మణా! వీరిరువురి సహాయమువలన సీతాన్వేషణము త్వరలో ముగింపఁబడగలదని తలంచెదను.

లక్ష్మ—అన్నా! అందులకు సందియములేదు.

రాము — తమ్ముఁడా! ఆంజనేయుఁడు సామాన్యుఁడనుకొంటివా? జగదాధారుఁడగు సూర్యభగవానునియొద్ద వ్యాకరణముఁ జదివి, గురుదక్షిణగా, సూర్యనందనుఁడగు నీసుగ్రీవునకు కుడిభుజముగ నలరారుచుండెను. ఇతండు బ్రహ్మశాపమునలన, తనబలముఁ దానెఱుఁగక బరులనాశ్రయించి యున్నవాఁడు సుమా! ఇఁకముందీతఁడే నా కాంతరంగికభక్తుఁడై, రామసేవాధురంధరుఁడై మనకు విజయముఁ జేకూర్పఁగలఁడు.

లక్ష్మ — ఆహా! మనమెంతయు నదృష్టవంతులమే గదా? (తెరవంక జూచి) అన్నా! ఎక్కడనో రణదుందుభి మ్రోగుచున్నది.

రాము — వాలిసుగ్రీవుల యుద్ధప్రారంభమగుచున్నది. మనకొఱకు హనుమంతుఁడిదే వచ్చుచున్నాఁడు. సమరాంగణమున కేఁగుదము రమ్ము.

లక్ష్మ — చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు.)

---

ద్వితీయదృశ్యము — రణరంగము.

[వాలి సుగ్రీవులు యుద్ధాభిముఖులై యుందురు. రాముఁ డొక చెట్టుచాటున బాణము సంధించియుండును.]

సుగ్రీ — ఓరోరి పరాంగనాపహారిణా! ఇంద్రనందనా! ఇంకెంత కాలము నీయాటలు సాగును రా!

ఉ॥ పాపమతీ! నాయనుగు । భార్యను దొంగిలి, తమ్ముఁడంచు సం
తాపముఁ జెందఁబోక, భుజ । దర్పమునన్ మనుమిన్నకాననన్
నా ఫలదాయమంగొని నను । బులఁ దోలితివిన్న మద్గదా
టోపముఁ జేత నీశిరము । ఫుల్లగఁ జేసెదఁ గాచుకొమ్మిఁకన్॥

వాలి — ఓరీ! దంభప్రలాపా! ఇంతకు ముందే గదా? సమరాంగణమున నాతోఁ బోరలేక కాలికిఁ బుద్ధిజెప్పుకొంటివి. సిగ్గులేక మరలవచ్చి, కారులాడుచున్న నిన్నింక మన్నింపరాదు.

గీ॥ యమగదాదండమున కైదు । రాఁడవచ్చు
నాయుపేంద్ర గదాఘాత । మోర్వవచ్చు
విలయకాలాగ్ని పిడుగు నా । విర్భవించు
నాగదాదండమునఁ జచ్చి । నావురమ్మ!॥

(హుంకరించును)

సుగ్రీ—ఓహో గర్వోన్మత్తా! నీయందునాకింకను భక్తివిశ్వాసములు గలవు. ఏల యన్యాయముగ రణనిహతుండవయ్యెదవు? నీవింకొక క్షణమునకు నిహతుండవయ్యెదవు. ఇప్పటికైన నాభార్యను, నాయర్ధరాజ్యము నొసంగి ప్రాణములఁ గాపాడుకొనుము.

వాలి—ఛీ! తులువా! అధమాధమా! నేఁటియుద్ధమున నీకోరికలన్నియు నెఱవేఱఁగలవు. రమ్ము. వచ్చెదవా? తొలఁగెదవా?

సుగ్రీ—మంచిది. సంసిద్ధుఁడవుఁ గమ్ము. (గదసారించును)

వాలి—ఇదె సన్నాహము. (ఇరువురు పోరాడుచుందురు.)

రాము—ఈదురాత్ముని దే మదీయబాణాగ్ని కింధనముఁ గావించెదఁ గాక. (బాణము విడుచును)

వాలి—హా! (అని నేలఁ గూలును)

(తెరవ్రాలును.)

---

తృతీయదృశ్యము—కిష్కింధానగరోద్యానము.

[సుగ్రీవుఁడు, తార, మధుపానము సేయుచుందురు]

సుగ్రీ—తారా! మధుపానమత్తతచే నొడలు దెలియక నిందే సోకుచుంటిని. వనవిహారము సేయుదమురమ్ము. (లేచి, తారను చేఁబట్టుకొని) దేవీ! ఈమయూరములెట్లు కేకారవములు సేయుచున్నవో కనుఁగొనుము.

తార—అవును. అదృష్టదేవత ఱెక్కలు విప్పుకొని నప్పుడు పండ్లు నిక్కి విఱ్ఱవీగుట సహజముకదా? వాలి జీవించినంతకాలము మూపిరియైన విడువక ఋశ్యమూకమున నీవుండలేదా? నేఁటికి శ్రీరామానుగ్రహమున నీవును, కేళివిపినమునఁ గేరుచుంటివి కాదా?

సుగ్రీ—ప్రియసఖీ! నన్ను దెప్పుచుంటివా?

తార—ప్రాణేశ్వరా! పరిహాసముఁగాని వేఱుగాదు. కాని. వర్షాకాలమంతరించినను సీతాన్వేషణమునకై బ్రయత్నింపవేల?

సుగ్రీ—ఉస్ ; అబ్బ; సీతాన్వేషణమున కేమిగాని, ముందాపూఁబొదరిండ్లకడ కేగుదమురమ్ము. నీసుందర సౌందర్యావలోకనమునఁదనివితీరినఁగాని, సమాధానముఁ జెప్పఁజాలను. పోవుదమురమ్ము,

(అంగదుఁడు ప్రవేశము.)

అంగ—(భయభ్రాంతుఁడై) తండ్రీ! ఇంకేమున్నది? లక్ష్మణుఁడు ధనుష్పాణియై, నిన్నన్వేషింపుచుఁ గాలరుద్రుఁడై ద్వారమునందవతరించి యున్నవాఁడు. ఏమియాజ్ఞ?

సుగ్రీ—(భయాశ్చర్యదృష్టులతో చకితుఁడై) ఏమీ! లక్ష్మణుఁడా! హా! తారా సతీ? నేఁడు నా కాయువు మూడినది. ఇంకేమిగతి? అంగదా! నీవామహాత్ముని భక్తిశ్రద్ధలతోఁ దోడ్కొని రమ్ము.

అంగ—చిత్తము. (నిష్క్రమించును.)

తార—నాథా! ఏమికీడు వాటిల్లునోకదా?

సుగ్రీ—దేవీ! నీవు నావెన్నంటి యుండుము. నీవలనఁగాని నేఁడు నాకు ప్రాణదానముఁ గలుగదు.

(బాణాసనములఁ జేఁబూని లక్ష్మణుఁడు ప్రవేశము.)

(అనుబంధము. 21)

లక్ష్మ— శా॥ ఓరీ దుర్మతి! యోకృతఘ్న! ఘనగ ర్వోన్మత్త చిత్తాధిపా?
స్వారాజ్యంబున శేముషీ విభవసం పత్కామి నై తారతో
శ్రీరామప్రభుకార్యమున్ మఱచితో గీ! నిన్ను సైరింతునా?
ఘోరాస్త్రంబుననిన్నుఁగూల్తునిదె, యాక్రోశింప భార్యాదులున్॥

తార—మహాత్మా! శరణార్థులము రక్షింపుము. (లక్ష్మణుని పాదములపైఁ బడును. సుగ్రీవుఁడామె వెనుక భయభ్రాంతుఁడై యుండును.)

లక్ష్మ—(సుగ్రీవుని సమీపించి) అరే! దురాత్మా! మిత్రద్రోహీ! వర్షాకాలము వెళ్లిన వెంటనే సీతాన్వేషణమున నప్రమత్తుఁడనై యుందునని చెప్పి, రాజ్యాది భోగానందమున నంధుఁడవై ప్రతినఁ బాలింపకుంటివా? లేక, రాముఁ డసమర్థుఁడని తలంచితివా? ఏఱుఁదాటి తెప్పఁగాల్చెడి కుహనాకిరాతుఁడవని గ్రహింపలేక పోతిమికదా? దుర్మదాంధా! నీకార్యానంతరమున నెట్లు చేసిన నట్లు చెల్లునని యూహించితివి కాఁబోలు? వాలినిసంహరించిన రామబాణమింకను, నీవంటి కృతఘ్నుల కుత్తుకలు గత్తిరింప నాలుకలుఁ గోరుచున్నదను యెఱుకలేదు కాఁబోలును? నిలువుము. నిన్నంతదూరమేలఁ గొంపోవలయును? మత్కోదండ కాండముల నీయొడలుఁజీల్చి, నీరక్తమాంస

ఖండములు గృధ్రములకాహారముఁ గావించి మఱి పోయెదఁగాక. కూడు
గుడ్డలేక గుట్టలఁబట్టియున్న నిన్నుఁ గొనివచ్చి సింహాసనమునఁ గూర్చుండఁ
బెట్టినందులకు నీజాతిలక్షణముఁ జూపించుకొంటివా? జాతిలక్షణ మట్టిదని
మ్మా. రాజ్యగర్వాంధకారమున సంచరించు నినుఁబోలు మిత్రద్రోహు
లుండుట భూమికెంతయు భారము. ఇదే చూడుము? నిన్ను నీకిష్కింధ
నొక్కనిశితశరాగ్నికీలలదహించి బూడిదఁజేసి సముద్రమునఁ గలిపెదఁ
గాక. (బాణము సంధించును.)

తార—(వాని పాదములపైఁబడి) రామానుజా! లక్ష్మణదేవా! పిచ్చుకపై బ్రహ్మా
స్త్రముఁ బ్రయోగించెదవా? నీకోపానలముఁ జల్లార్పుము. నానాథుఁడు
జేసిన యపరాధమునకు "పతి భిక్షాం దేహి" యని నిన్ననే ప్రార్థించుచున్నా
ను. మీవంటి యుత్తమపురుషు లపరాధులనైన గావఁగంకణము ధరించియు
న్నారు. ఇది మొదటితప్పుగాఁ బరిగ్రహించి మమ్ము రక్షింపుఁడు. రామ
కార్యమునసింక నప్రమత్తుఁడై నాపతి వర్తింపఁగలఁడు. దేవా! నాకభయ
మిచ్చినఁగాని, నీపాద కమలములు విడువను.

లక్ష్మ—కాంతామణీ! లెమ్ము. క్షమించితిని. సుగ్రీవా! నీవింత మదోన్మత్తుఁడవై
రామకార్యము మఱచెదవని తలంపమైతిమి కదా?

సుగ్రీ—దేవా! (నమస్కరించి) ముందు నీకృపావలోకనమున జీవించితిని. రాజ్యమ
దాంధత్వమున నొడలు మఱచి రామకార్యము మఱచినమాట వాస్తవము.
శ్రీరామ సన్నిధానమున నే నేమొగముతో క్షమింపుమని వేడెదను? దయా
భరణా! లక్ష్మణా! రామానుగ్రహమున నన్ను బ్రతికింపుము.

లక్ష్మ—సుగ్రీవా! భయపడకుము. నే నామహాత్మునితో విన్నవించి నీభయముడి
పెదరమ్ము.

సుగ్రీ—చిత్తము. (అందరు నిష్క్రమింతురు.)

చతుర్థ దృశ్యము—మాల్యవంత గిరిప్రదేశము.

[కపిసేనతో శ్రీరామలక్ష్మణ సుగ్రీవాంగదులు ప్రవేశము.]

సుగ్రీ—రామచంద్రా! పర్వత, వృక్ష,నదీ, గుహాలయందుండెడి సమస్త వానరానీ
కమును రప్పించితిని.సీతాన్వేషణమున కాజ్ఞనొసంగ వేచుకొను చున్నాఁడను.

రాము—సుగ్రీవా! ప్రయత్నింపుము.

సుగ్రీ—ఓ వానరవీరులారా! శతబలి గవయాదులారా! మీరు తూర్పుపరిసర సముద్ర పర్వతప్రదేశములాదిగ నన్వేషింపుఁడు. దీర్ఘముఖులారా; మీరందఱు పశ్చిమారణ్యములనెల్ల వెదకుచు నస్తాద్రిని సమీపింపుఁడు. వజ్రగోమాది కపులారా! మీరుత్తర ప్రదేశమంతయుఁ జక్కఁగా నరయుఁడు. హనుమజ్జాంబవంత సుషేణాంగద ప్రముఖులారా! ఈ కార్యభారమంతయు మీనెత్తిపైనున్నది. మీ రేవిధినైన సంగష్టించి సీతామహాదేవిని రామచంద్రునకు సమర్పించుటయే ముఖ్యకర్తవ్యము. వెండియు మీకొక్కటే హెచ్చరిక. జానకీదేవి వృత్తాంతముఁ దెచ్చుట, లేనియెడల బ్రాణములఁ బాయుట. కార్యముపట్ల నతిజాగరూకతతో వర్తింపవలయును. మీకు రెండుమాసములుగడువిచ్చితిని. దక్షిణదేశమే రావణుని వాసమగుటచే మిమ్ముఁ బంపుచుంటిని. మీ తెలివితేటలిందుఁ జూపవలయును.

కపులు—చిత్తము.

సుగ్రీ—శ్రీరామమూర్తీ! ఒక విశేషముఁ గలదు. ఈవానర వీరులందు జాంబవంతాది ప్రముఖులున్నవారు. కాని, యిందాంజనేయుఁ డసమానుఁడు. అఖండభుజబలసమన్వితుఁడు. ప్రభుసేవాపరాయణుఁడు. నీతివిశారదుఁడు, చిరకాల మృత్యుంజయుఁడు. ఈతఁడే మనయాపదఁగడువం బెట్టఁదగిన సమర్థుఁడు. మారుతీ! రామాజ్ఞ వహియుము.

ఆంజ—(చేతులు జోడించుకొని)

శా॥ శ్రీరామా! రవివంశ సోమ! వినుతా ! సీతామనఃకామ! స
త్కారుణ్యామృత రామనామ; త్రిజగ ! త్కళ్యాణ రామా! మహో
దారా! శాత్రవభీమ! రామ! పరమా ! త్మారామ! నిష్కామ! సీ
తారామా! సుగుణాభిరామ! మునితా ! ధామా! నమస్తేనమః॥

రాము—అనిలతనయా! ఆంజనేయా! రమ్ము. ఎటుల సుగ్రీవునితో నాకుఁ జెలిమి సంఘటించి కార్యమును నిర్విఘ్నముగ నెటుల నెఱవేఱఁ జేసితివో, యటులనే నాయీకార్యముసాధించి యశఃకాంతను వరింపుము. నీయందే కార్యసిద్ధియు, నామనోరథసిద్ధియు, ఫలసిద్ధియు నెలకొల్పఁబడియున్నవి. నీబుద్ధిబలసామర్థ్యము పయోగించి, సీతావియోగమున మునిఁగియున్న నన్నెటులుద్ధరించెదవోగదా? జానకీదేవిని నీవిదివఱకే చూచియున్నాఁడవు. అయిననుమఱియొకసారి తెలిపెదను. ఆమహిళాలలామ నారచీరలు ధరియించి, దేహసంస్కారములులేక,

నన్నుద్ధ్యానపరాయణన్గాయుండును. ఆసుశీలవదనకమలమున శ్రీవిలసితమగు పద్మాదిరేఖలు నేత్రోత్సవముఁ జేయుచుండును. నీవాసాధ్విని గాంచిన వ్వుడు, నిన్నా మెరాక్షసునిగ భావించి శంకించును. తత్సంశయనివారణార్థై, యీయంగుళీయకమూ మెకొసంగిన, నిన్నాదేవి మిక్కిలి గారవించును. (ఉంగరమిచ్చి) వాయునందనా! ఇంకఁ గ్లుప్తముగ నూపమాటలుఁ జెప్ప ద వినుము. నామారుగ నీవామెతో నిట్లు వచింపుము.

సీ॥ నినుఁబాసి నదిమొదల్ । నిమిసంబు యుగముగాఁ
గడుపు రాముండని । నుడువుమన్న!
నిజాడఁ దెలియక । నినుఁబోవ గానాల
సించె రాముండంచుఁ । జెప్పుమన్న!
పవలు రేల్ నీనామ । పఠనీయమేగాని
పరచింత లేదంచుఁ । బలుకుమన్న!
వాలిఁ గూల్చిన రాము । కోల, రావణుజంప
వేచియున్నదని వి । న్పింపుమన్న!
గీ॥ కొద్దిదినములకేను నీ । వద్దఁ జేరి
చీల్చెద నురేంద్రుననుచుప । చింపుమన్న!
ధైర్యము వహించుమనుచు నో । దార్చుమన్న!
పోయి, కనుఁగొని శుభములు । బొందుమన్న!॥

హను—చిత్తము. ఇదె మీయాజ్ఞ శిరమున ధరించెదను.

(యవనిక జారును.)



పంచమదృశ్యము—సముద్రతీరము.

[కపిసేనతో హనుమంతుని ప్రవేశము]

ఆం—(కపిసేనఁజూచి) ఓప్లవంగపుంగవులారా! సముద్రోల్లంఘనోత్సాహపరతంత్రుఁడనై నభోవీధి కెగయుదునేని, నాపదఘట్టనంబున భూమి కృంగఁగలదు. కావున, నేనీమహేంద్రాచలము నధిష్ఠించి జలరాశి దాటిపోయెదఁగాక.

కపులు—జయము. జయము. అట్లే చేయుము.

ఆంజ—(మహేంద్రనగమెక్కి చేతులు జోడించుకొని) ఓసూర్యచంద్రులారా! అష్టదిక్పాలులారా! పంచభూతములారా! సప్తసముద్రములారా! త్రిమూర్త్యాత్మకులారా! బ్రహ్మాదిదేవతలారా! శ్రీరామకార్య దీక్షాపరుండనగు నాకు మీరందఱు సహాకారులై యుండుఁడు. హేదశరథరామా! వందితామరస్తోమా! నీలమేఘశ్యామా! సీతారామా!

సీ॥ అజ్ఞానమను, సుషు । ప్త్యకాంత కెవ్వాని
సారరత్నము కు । తారధారి
శాశ్వతకైవల్య । సంప్రాప్తి కెవ్వాని
పల్లవారుణపద । భక్తిముక్తి
కలుషితోగ్రానల । జ్వలితంబు కెవ్వాని
పూజా విధానంబు । భూరివారి
సంసార జీమూత । జలరాశి కెవ్వాని
శ్రీకరాంఘ్రిద్వయ । సేవనాప

గీ॥ వేల్పులకు, భక్తులకు, నట్టి । వీనివాస
రాగరహితుల కెవని ద । ర్శనము పరము;
అట్టి నీకృపఁగల్గ నా । కబ్ధియెంత?
రామ! రఘురామ! శాత్రవ । భీమ రామ!॥

(అనుబంధము 22)

(అని పైకెగసిపోవును.)





శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సంపూర్ణ రామాయణము.

## పంచమాంకము

ప్రథమదృశ్యము—లంకానగరము.

(ఆంజనేయుఁడు ప్రవేశము)

ఆంజ—(అనుబంధము.)

అక్కటకటా! నాకష్టమంతయు వృథయయ్యెనుగదా? సూక్ష్మరూపుండనై లంకానగరమంతయుఁ బరిశోధించితిని. పరమపాతకుఁడనగు నాకేలసీతాదేవి దర్శనము లభించును. పురంధ్రీమణిని, రావణుఁడు రథముపైఁ గొనివచ్చునపుడు భయంకరమగు పారావారమునుఁజూచి భయపడి సముద్రగర్భమునఁ జొచ్చియుండునా? లేకున్న తనపాతివ్రత్యమును కాపాడుకొనుటకై ప్రాణత్యాగ మొనరించుకొనియుండునా? అయ్యో! జాంబవంతాది కపివీరులకేమని వచింతును? "మారుతీ! సీతను జూచితివా? క్షేమముగనున్నదా" అని రామచంద్రుఁడతి ప్రేమచే నన్నడుగ నేనేమని వాక్రువ్వఁగలను? సీతకానరాలేదని నానోటనుండి వెలువడినంత నేదాశరథి జీవించునా? అగ్రజుని పాటుఁజూచి లక్ష్మణుఁడు కడ తేరకుండునా? తన ప్రాణదాతలను, మిత్రరత్నములను పోగొట్టుకొని సుగ్రీవుఁడు మనియుండునా? వాని మరణవార్త విని తారారుమాది పతివ్రతలు మేనఁబ్రాణములుండఁ జూచుకొనునా? అయోధ్యయందు రాముని రాకకెదురు సూచుచున్న భరతుఁడీ వృత్తాంతమాలించి ప్రాణములభరించునా? వరపుత్రుల దుర్మరణముఁజూచి, కౌసల్యా సుమిత్రాదులు లోకాంతరమేగకుండునా? హా! ఎంత ఘోరము? ఎంతపాపము? నావలనఁగదా యీ మహాప్రళయము. అకటా! తుదకు నాజీవితము

నకెట్టి కళంకము గలిగెనది! ఆనాఁడే నా తల్లికి గర్భస్రావమైన యేకష్టములు
లేకుండునుగదా? అట్లేల జరుగును? రఘుకులము పాలిటి మృత్యువునై,
కపికులమునకు విలయాగ్నినై దుష్కీర్తి బడయనుంటిని. హా! నేనెంత పాప
కర్ముండను! సకలలోక మారణశక్తులారా! నన్నేల చంపకున్నారు? విలయ
కాలానలజ్వాలలారా! నన్నేల దహింపకున్నారు? అయ్యో! యీపాపసంభ
వునేల హతమార్పకున్నారు? అయ్యో! భూభారకుఁడనగు నన్నుఁజంప
నొక్కరైన ప్రయత్నింపకున్నారుకదా! ఏమిచేయుదును? ఇందే యగ్నిఁ
గల్పించుకొని, యందుఁజొచ్చి శరీరముఁ బాసెదఁగాక. అయ్యో! అకారణ
ముగ నేఁడుఁ జచ్చిన ప్రయోజనమేమి? "కష్టేఫలీ" యని యార్యులు వచిం
తురుగదా? నే నన్వేషింపవలసిన ప్రదేశములింకఁ గొన్ని కలవు. మరలఁ
బ్రయత్నించిచూచెద. ఆసాధ్వితల్లి గర్భస్థమైనచో సరియే. అటులఁగా
కున్న, నింకఁ యనర్థమునకు మూల మారావణుఁడుగదా? వాని వదన
కమలముఁ దున్మి శ్రీరామచంద్రునకు కానుకగా సమర్పించెదను.
అటులఁగాదేని, రాక్షససహితముగ నీ లంకాపట్టణముఁ గూఁకటివ్రేళ్లతోఁ
బెకలించి సముద్రమున ముంచివేసెదఁగాక. (తెరవంకఁజూచి) ఏమది?
ఆకసంబుననుండి రామనామమున నేదియో కోలాహలము వినవచ్చుచున్నది.
అయ్యారే! స్త్రీలసంవాదమువలెఁ దోఁచుచున్నది. ఒకవేళ మాసీతామతల్లి నం
దుబంధించి దానవాంగనలేమైన బాధించుచున్నారేమో? పోయి కనుఁగొ
నెదఁగాక. (నిష్క్రమించును.)

---

ద్వితీయ దృశ్యము—అశోకవనము.

[రాక్షసీగణముతోఁ సీత కూర్చుండియుండును]

ఆంజనేయుఁడు—(ప్రవేశించి) ఈమె యెవరో రామనామముచ్చరించుచు శోకావేశ
మున మునిఁగియున్నది. స్వరము కుంగి యుండుటచేత నీమె యాలాపములు
స్పష్టముగ వినఁబడకున్నవి. శ్రీరామచంద్రుఁడు వచించిన లక్షణములు
గుర్తించుటకు నుచితము, దూరమగుటచే సాధ్యముఁగాకున్నది. కావున,
నేనా యశోకవృక్షము నెక్కి సర్వము నారసెదఁగాక. (అని వృక్షమెక్కును.)

సీత—హా! పరమేశ్వరా! దుఃఖభాజనమగు నాజీవితమున కింక నిష్కృతిలేదా?
అనాథ రక్షాదక్షుఁడవయ్యు, ననాథయువతీ పరిరక్షణమునకేలఁ బ్రయత్నిం

వవు? నీకింత పక్షపాతముఁ దగునా? నీకు నాయెడ దయలేకున్న, నాజాడ శ్రీరామ లక్ష్మణులకైనఁ దెలిపి పుణ్యముఁగట్టుకొనరాదా? అయ్యో! ఏమివెఱ్ఱి? స్వయంకృతాపరాధమునకు నగవక భగవంతుని దూరి పాపము ఁగట్టుకొననేల? నన్నుఁగట్టఁ దాళ్ళు నేనె తెచ్చుకొంటినిగదా?

సీ॥ స్వర్ణకురంగంబు । పర్ణశాలకు రాగ
పోలుపుగ నాకాశఁ । బుట్టనేల
పుట్టెఁబో; ధానినిఁ । బట్టి తెమ్మంచును
శ్రీరామచంద్రుని । గోరనేల
కోరితిఁ బో; పతి । మారుమాటాడక
హరిణ శాబకముతో । నరుగనేల
అరిగెను, బో; గుండె । లవియఁగ నాకంత
హా! లక్ష్మణాయంచు । నరవనేల

గీ॥ అరచెఁబో; లక్ష్మణునకుఁబో । మ్మనఁగనేల
ఆతఁడు నలదంచు వేడ, దూ । రాడనేల
ఇప్పు డమరారిచేఁజిక్కి । యేడ్వనేల
చివికి, దుఃఖపుచావిట్లు । జెందనేల ॥

వినాశకాలమున నెట్టివారికైన నిట్టిబుద్ధులె పుట్టుచుండునుగదా? హా! జీవితేశ్వరా! జానకీ చిత్తచోరా! నీవే యుపేక్షించిన నాగతి యింకేమికావలయును? ఓమఱఁది! లక్ష్మణా? అకారణముగ నిన్నుదూరి ప్రతిఫల మనుభవించుచున్నపడంతిని రక్షింపరాదని బొమలు ముడివైచితివా? లేదు. లేదు. నా జాడ మీకుఁ దెలిసియున్నచో క్షణమూరకుందురా! అయ్యో! తెలిసియుఁ జేయునదియేమి? ఎక్కడి లంకానగరము? ఎక్కడి వింధ్యారణ్యము. నక్కకు నాగలోకమునకు డగ్గర చుట్టమనినట్లున్నది. కట్టా! ఇంక నాకేటియాశ? హా రామా! నాకింక మరణమే శరణ్యముసుమా!

హవిర్జట—ఏమేసీతా! నీవువచ్చి నాల్గుమాసములు కావచ్చెను. ఇంతకాలమునుండి మేమెంత బోధించినను వినవైతివి. ఇంకనైన మామాటలు వినెదవా! లేక నీపనిఁ బట్టమనెదవా?

రక్తాక్షి—నోరుమూసికొని మాటలాడకున్న మేమూరకుందుమనికొంటివేమో? నేఁటితో నీయభిప్రాయముఁ దెలవలయును. మా రావణచక్రవర్తి రాక

ముందే మాకు లోఁబడుము. లేకున్న నీబ్రతుకుకుడితిలోఁబడిన యెలుకచందమగును. ఏమి? చెప్ప వేమి?

సీత.—ఓ రాక్షసాంగనలారా! మీకఱకుఁ గత్తులచే నా దేహమెల్ల ముక్కముక్కలుగ దఱిగిన నే నోర్చుకొనెదఁగాని, నేనుమాత్రము మీరాయంకెకు రాజాలను.

అంగనలు.—ఇదే నిన్ను హింసించెదము చూడుము.

సీత.—(భయభ్రాంతయై) హా! రామా! రాఘవరామా! నన్నీ ముక్కిడికక్కసుల బాధనుండి తొలగింపరావా! జగత్పరిపోషకుఁడవగునీకు నేను భారమైతినా?

సీ॥ నన్నేలఁ గారాదె । యన్నిలోకమ్ముల
నేలువాఁడు; వినోద । లీలవాఁడు
కాపాడఁగారాదె? కౌసల్యముద్దులఁ
గనెడివాఁడు, తాపసుల । మనిచివాఁడు
నా మొఱాలింపఁడే । నళినాప్తకుల కీర్తి
గొన్నవాఁడు, వియోగి । యున్నవాఁడు
తనపత్నిఁ బ్రోవఁడే । తనుఁజేరువారలఁ
గాచువాఁడసురుల । నేచువాఁడు
గీ॥ పతినిఁగావఁడె, దీనుల । సాకువాఁడు
కరుణఁ గలవాఁడు, బమ్మను । గన్నవాఁడు
కలిమితేఁడు, విరాగుఁడు । పుడమితేఁడు
నాదు శ్రీరామచంద్రుఁడు । నాకు లేఁడు॥

ఆంజ.—(చెట్టుపైనుండి క్రిందకుదూకి)

గీ॥ భళిభళీ! కంటి, రీనయన ప । ర్వంబుఁగాఁగ
చండకరమండల సదృశా । ఖండకీర్తి
రాజితుండైన శ్రీరఘు । రాముకాంత
నమలభూజాతఁ, ద్రిభువన । మాతసీత॥

జారా! ఈ రేడులోకములను కరుణాకటాక్ష వీక్షణామాత్రమున నేలఁజాలు, నీవు

రంధ్రీరత్నము, నిరంతరము రామధ్యానమునఁ గృశించి సహజసౌందర్యమున నెంతయు నొప్పుచున్నది. అకటా! అట్టి సాధ్వీమతల్లికా యిట్టి దురవస్థ.

సీ॥ శ్రీకర పట్టాభి । షిక్తయగా నీతల్లి
ముక్తాశ్రువుల నభి । షిక్తయయ్యె
శ్వేతచ్ఛత్రమునీడఁ । జెన్నొందు నీదేవి
తరుశాఖక్రిందనీడఁ । దనువుఁ జేర్చె
చెలికత్తెలుం గొల్వ । నలరారు నీమాత
క్రూరరక్కసిమూకఁ । గొల్చుచుండె
సకలరాజ్యమండలి । శాసించు నీసాధ్వి
ఖలదానవుని యాజ్ఞ । మెలఁగవలసె

గీ॥ అకట! లోకైకమాత యి । ఖ్యాతచరిత
నధికదుఃఖపరంపర । లందు ముంచి
కష్టపెట్టుచునున్న యీ । కట్టిడి విధి
తంత్రమో? సృష్టిచిత్రమో? । తెలియరాదు॥

(వినుట నభినయించి వెనుదిరిగి చూచి) ఓహో! రావణుండిటే వచ్చుచున్నాఁడు. ఇది సమయముగాదు. అంతదనుక నీతరుశాఖపై నెక్కి, దురాత్ముఁడీ సాధ్వీమతల్లితో నేమి సంభాషించునో వినెదఁగాక. (చెట్టెక్కును)

రక్తాక్షి—సీతా! మారాజేంద్రుఁడు వచ్చుచున్నాఁడు. ఇంక నీగతి యోచించుకొనుము. (వాని కెదురేగుదురు)

సీత—అయ్యో! చచ్చితి. చచ్చితి. హా! రామా! నేటితో నాయాయువు సరిపోయినది. ఈజన్మమున నినుఁజూచు భాగ్యమింకఁ గలదో లేదో కదా? హా! రామచంద్రా!

(పరిజనముతో రావణుఁడు ప్రవేశము)

రావ—అంగనలారా! మీరావలకుఁ బొండు?

పరిజనము—చిత్తము. (లోనికేగుదురు)

రావ—సీతా! ఏల నన్నుఁజూచి భయాశ్చర్య లజ్జాభిమానములతో నుండెదవు? నీరమణీయాంగకములు వస్త్రనిరోధమున మఱింత మఱుఁగుఁ బఱచెదవేల?

భవదపాంగావలోకనభాగ్యమునకై, మున్ను నేనెంతయో తపఃఫలసిద్ధుఁ డనైయిట్లు జన్మించితినిగాని వేఱుగాదు. నీదరహాసచంద్రికలు నాపైఁ బ్రయోగించినఁజాలు. రమణీయ కైవల్యపద మొకక్షణకాలమున నేలఁ జాలుదును. ఏదీ? నీసుందరవదనారవింద మెత్తి యొక్కమాఱైన నాఁడుమా?

అంజ—(లోనలో) పాపాత్మా! ఏమిరా నీకంతక్రొవ్వు?

సీత—(తృణముఁ జేతఁబట్టుకొని) దురాత్మా! పతివ్రతాశిరోమణుల నిటులఁ జెఱఁ బట్టుచుఁ గలుషాత్ము లాఁగుచున్న నీనాల్క చీలకున్న దేమి? సాధ్వీమతల్లుల యుసురు నీకుఁ దగులకపోదుసుమా! నాశరీరముమాత్రము నీ నిర్బంధము నందున్నది గాని, నాయంతరాత్మ నీ నిర్బంధమునకుఁ జిక్కినది కాదని యెఱుంగుము. నోటికివచ్చినట్లు వదరకుఁ దొలఁగిచనుము. దైత్యవిరాముఁ డగు దశరథరాముఁడు జీవించియున్నాఁడనిమాత్ర మూహించుకొనుము.

అంజ—(లోనలో) తల్లీ! వజ్రాయుధమువంటి పలుకు పలికితివి.

రావ—రాముఁడు రాముఁడని నన్నేల బెదరించెదవు? ముక్కాలు మూఁడుగడియ లలో రామలక్ష్మణులను బంధించుకొనివచ్చి నా కారాగారమందుంచినఁగాని నమ్మవు కాఁబోలును.

అంజ—(స్వగతము) ఆగతి నీకే పట్టనున్నది. తొందరపడకుము.

సీత—దైత్యాధమా! దురహంకారమునఁ బేలుచుంటివిగాని, నీ వారామలక్ష్మణుల దృష్టిపథంబునంబడి, మరల బ్రతికివచ్చినప్పటి మాటగదా? నీజ్ఞాతులైన ఖరదూషణాదులు, నీ మామయైన మారీచుఁడుఁ జన్నమార్గమున జనక, బుద్ధిఁ దెచ్చుకొని, నన్ను రామచంద్రున కర్పించి శరణువేఁడుము.

రావ—జనకరాజపుత్రీ! ఎట్టులో నీపతివలనఁ జచ్చిన రాక్షసాధములమాటటుండ నిమ్ము. పిచ్చుకపై బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించు నీరాముఁడు నిన్ను నేను చెఱఁగొని తెచ్చినను, మగఁటిమియున్నచో, నింతకాల మూరకుండునా? నీవేల వెఱ్ఱిపోకలఁబోయెదవు?

గీ॥ కౌసలేయుఁడు మత్స్యమై । కడలిఁజొరిన;
కూర్మరూపముఁ దాల్చిన; । క్రోడమైన;
పారుఁడైన; నృసింహావ । తారుఁడైన
వానినింకక్షమింపనో । వనజవదన! ॥

ఆంజ—(స్వగతము) అవును. జ్ఞాతులమార్గమే యనుసరించితివి.

సీత—ఓరీ! రావణా! నీవనినటుల నిజముగ నవతారపురుషుఁడగు రాముని శిక్షింప నీవుఁగావుగదా? నిన్నుఁబుట్టించినవానికైనఁ దరముఁగాదు. నీవ కారణముగ రామచంద్రుని ద్వేషింపకుము. భీకరహర్యక్షపాలితమగుకందరంగము నీవంటి శునకమున కసాధ్యముసుమా? రామసింహము గుహాంతరమున కేగినప్పుడు వాని రమణిఁగొనితెచ్చిన గ్రామసింహా! కడిచికూర్చుండక మృత్యువు నేల వరించెదవు?

సీ॥ రాముకోపపుదృష్టి । ప్రళయాగ్నికీలలై
పఱతెంచి, లంకపైఁ । బడకమున్నె
పిడుగులఁబోలు, సౌ । మిత్రిబాణములు నీ
సంతానమును గూల్చి । చనకమున్నె
లంకాపురంబెల్ల, । రాక్షసరక్తధా
రల ప్రవాహములఁ బా । ఱకమున్నె
చెలఁగి నీపదితలల్ । శ్రీరామచంద్రుని
కార్ముకమున బూది । గాకమున్నె

గీ॥ వెడఁగ! నీప్రాణవిడలేక । విడకమున్నె
క్షితివిధవాంగనలరోదల్ । వినకమున్నె
ధరణి, రాక్షసకులము రూ । పఱకమున్నె
శరణువేఁడుము, రాముని । సైపుమనుచు॥

ఆంజ—భేష్! కుక్కకాటుకు చెప్పుదెబ్బలుఁ గొట్టినట్లు చెప్పితివమ్మా!

రావ—(కోపముతో) ఆ! ఊరకొన్నకొలంది నోటికివచ్చినట్లు వదరుచుంటివే? నరాధముఁడేగాక, తృణప్రాయుఁడగు నీరాముని, సమస్తలోకాధీశ్వరుండగు రావణసార్వభౌముఁడా శరణుఁగోరుట? ఏలఁ బలుపోకలుఁ బోయెదవు? దేవాంగనల కృపావలోకన విరాజితుఁడగు రావణుఁడు, తనంత దాఁ గేలుమొగిడ్చి వేఁడుకొనుచున్నను నిరాకరించుట నీకుఁ దగదుసుమా! నాలుగుమాసములనుండి నిన్ను బ్రతిమాలుచున్నాను. సిరిరా మోకాలొడ్డుటఁదగదు. "రామా రామా" యని నిద్రాహారములకు దూరమై, ధూళిధూసరమగు నేలపైఁబడి పొరలి దుఃఖింప, నీకర్మమేమికాలిపోయినది? "రావణా! రావణా!"

యని స్మరింపరాదా! రాజాన్నముందిని, మందిరారామముల సుఖింపరాదా? యోచించుకొనుము. ఇదె నాకడపటి సంభాషణ.

సీత—దైత్యకులాధమా! నీవంటి కామోద్రేకగర్వచిత్తసంచారునకు, ధర్మాధర్మములు, న్యాయాన్యాయములు పరిశీలనముండునా? పుట్టినఁబుట్టిన బుద్ధి పుడకలతోఁ బోవలయుఁగాని, హితవచనములు బాగుసేయఁజాలవు. నీవేమో, ముల్లోకముల జయించినవాఁడనని బీరములుఁ జూపుచుందువు గాని, నీవంటి పిఱికివాఁడు—శూరమ్మన్యుఁడు—రాక్షసకులమునందికఁ బుట్టఁబోఁడు. ఏమంటివా? యజమాని యింటలేని సమయమున నన్నపహరించిన దొంగలనాయకుఁడవు. అనురాగములేని యనాథయువతుల బాధించుచుందువు. క్రూరహింసా కార్యములుఁ జేయు కటికివాఁడవు. బ్రహ్మవంశమున జనించిన ఛండాలుఁడవు. కావున, పశుసమానుఁడవగు నీవెక్కడ? జగత్ప్రాణుఁడగు రామచంద్రుఁడెక్కడ? ఆర్తావనదీక్షాపరతంత్రుఁడు, రాముఁడు. ఆర్తజనాపకారుఁడవు నీవు. గోబ్రాహ్మణ శిశుసంరక్షకుఁడు, రాముఁడు. గోబ్రాహ్మణ భక్షకుఁడవు నీవు. లోకబాంధవుఁడు రాముఁడు. లోకవిద్రావణుఁడవు నీవు. నీయట్టి జగద్ద్రోహి నిదివఱకే నా శాపానలమున భస్మముఁ జేసి యుందునుగాని, రామాజ్ఞలేని కారణమున నీవిట్లింకఁ దుళ్ళిపడుచుంటివి. సపుత్త్ర బాంధవముగ రామశరాగ్నిలో నీవు బూదిఁగావలసి యున్నట్లు, నలువ నీమొగముల సువర్ణాక్షరములతోఁ జిత్రించియున్నాఁడు. నీపాటునకింకఁ జేటుఁబుట్టును. తొలఁగిచనుము.

రావ—(కోపముతోఁ గత్తిదూసి) ఓకలుషాత్మురాలా! సీతిరస్కృతికదియే ఫలము. కనుఁగొనుము. (చంపఁబోవును.)

ఆంజ—దురాత్మా! నిన్నిదే చంపివేసెదను.

త్రిజట—(ప్రవేశించి రావణుని చేయిఁబట్టుకొని) రాక్షసేశ్వరా! నీవంటివాఁడనాథ యువతిని జంప సాహసించిన లోకమునకెంతఁ జులకనగును? శాంతించి గృహోన్ముఖుండవుగమ్ము.

రావ—ఓరాక్షసీ గణములారా!

స్త్రీలు—(ప్రవేశించి) ఆజ్ఞ.

రావ—మఱి రెండుమాసములు గడువిచ్చితిని. అప్పటికిని మెత్తపడకుండెనేని, నా

యానలేకయే మారీచుని జంప శక్తుఁడు. ముమ్మాటికిని మీకిదే యాజ్ఞ.

(నిష్క్రమింతురు.)

స్త్రీలు—చిక్కను.

సీత—అమ్మా! త్రిజటా! ఈలంకానగరమున నీవొక్కదానవే నాకాప్త బంధురాలవు. నీవు లేకున్నచో నేనిదివఱకే జచ్చియుందును. నీయుపకారము జన్మాంతరము మఱచిపోనసుమా?

త్రిజట—అమ్మా! సీతమ్మా! నావలన నేమగును? ఈశ్వరాజ్ఞ. తల్లీ! నీవుకొంచెము సేపు పఱుండుము. నేనీదానవాంగనల నావలకుఁ గొంపోయెదను. రాక్షసులారా! ఇప్పటికె యర్థరాత్రిము మీఱినది. మీకివలకు రండు. ఆతల్లి కొంచెము సేపు నిద్రించును. పోవుదము రండు. (వారిని వెంటఁబెట్టుకొని పోవును.)

ఆంజ—(వృక్షమునుండి దిగి తనలో) ఈమె యెవరో రాక్షసాంగనయైనను ధర్మతత్పరయై మాయమ్మను గాపాడుచున్నది. నేనిప్పటికంతయు ధన్యుండను. ప్రదేశము నిర్జనమైనది. సీతమ్మతల్లినింక సమీపించుట కిదే సమయము. కాని, రాక్షసాన్వితప్రదేశమున నన్నీమె నమ్మునా!

సీ॥ చెప్పుదునా! రాము । సింహ దూతననుచు;
నామాటనమ్మునో । నమ్మదో గద
అరుగుదునా! సీత । నగసివచ్చితినంచు
నామీద రాముఁడే । మనునొ రోగద
కొనిపోదునా! దేవి । నినుకు లేశునిచింత
సాధ్వి యేమనునొ । యెంచ రోగద
దండింతునా! దుష్టు । దశకంఠునిం బట్టి
నావల్లనీ మొకు । నష్టముగద
గీ॥ ఏమి సేయుటకునుఁ దోప । దేమి సేతు;
త్వరపడిన కార్యమేరీతిఁ । జరుగఁగలదొ;
వేగిరింపకనున్నచో । విఫలముగునొ;
దారిఁ జూపింపుమయ్య! । కోదండరామ!॥

(యోచింపుచుండును)

సీత—నాకింక నెక్కడి జీవితాశ? రావణుండు నిశ్చయముగ శాసించినాఁడు. తేపటి నుండి రక్కసులు నన్నమితముగ బాధింపక మానరు. నేనీబాధలనింక ననుభవింపఁజాల. ఇప్పటి కర్ధరాత్రము మీఱినది. అందఱు నిద్రాముద్రితులై యున్నారు. ఇంతకంటె నాకు సమయముఁ జిక్కదు. నాయీ కేశపాశముఁ గంఠమున నురివేసికొని చచ్చెదఁగాక. (అటులఁ బ్రయత్నించుచుండును.)

ఆంజ—(ఆమెను జూచి) ఓహో! ఈమె యెంత సాహసమునకు తెగించినది? తల్లీ! సీతమ్మతల్లీ! సాహసింపకుము. నేఁజే నీకు తెలివిముక్తి.

సీత—(భయాశ్చర్యములతో తనలో) ఎక్కడిది వాసరము? రావణుఁడీరూపమున వచ్చి యుండఁడు గదా? (ప్రకాశము) ఓరీ! మాయావీ! నీమాటలు నావద్ద సాగిరావు. తొలఁగి చనుము.

ఆంజ—తల్లీ! నేను పెరవాఁడను గానుసుమా!

సీత—(స్వగతము) ఆహా! ఎన్నాళ్ళకు రామనామామృతము నాచెవులు వింటఁజేసెను? వీని రామనామ స్మరణమున నా మేనఁబులక లెత్తెను. ఇతఁడెవ్వఁడై యుండునోకదా?

ఆంజ—ఓ సాధ్వీమణి తల్లీ! నేను మాయారాక్షసుఁడఁగాను. శ్రీరామదూతను. నేనాంజనేయుఁ డనువాఁడను. శ్రీరామలక్ష్మణులు సుఖముగానున్నారు. రామచంద్రుఁడు, సుగ్రీవుఁడను వానరేశ్వరునితోఁ జెలిమి వాటించి, నీజాడఁ గనుఁగొనిరమ్మని నన్నుఁ బంపియున్నాఁడు. తల్లీ! నా వందనములందుకొని నన్ననుగ్రహింపుము.

సీత—నిన్నుఁజూడ నాకనుమానముగ నున్నది. కాని, నీమాటలు నాకమృతధారలై సంతోషముఁ గలిగించుచున్నవి, అయినను, నిన్ను నేను నమ్మఁజాలను.

ఆంజ—అమ్మరో! నేను దశకంఠుఁడను గాను. నిరంతరమీవు రక్కసుల నడుమఁ జిక్కి సుఖించుచున్నదానవగుటచే నన్ను నమ్మకున్నావు. అమ్మా! నేను నీబిడ్డను, శ్రీరామ రామాభిరామ మానసుఁడను. శ్రీరామబంటును. వాయుప్రసాదమున నంజనీదేవి గర్భాబ్ధచంద్రుఁడను. నన్నింకనైన విశ్వసింపుము.

సీత—అన్నా! రామచారిత్ర సుధారసపానచిత్తుండవగు నీవు, నిక్కఁపుబంటువే

దైన, రాముని సౌందర్యాదిగుణములెట్లుండునో? లక్ష్మణుఁడెట్టివాఁడో సక్రమముగఁ దెలిపితివేని నాసందియము నివర్తి కాఁగలదు.

ఆంజ—లోకజనయిత్రి! జనకరాజపుత్రి! అవధరింపుము.

ఉ॥ తామరపత్రనేత్రుఁడు; బు । ధసంస్తవనీయుఁడు; నీలనీరద
శ్యాముఁడు; సద్గుణాఢ్యుఁడు; ప్ర । శాంతుఁడు; పూజ్యుఁడు; నందితామర
స్తోముఁడు; వారిజాప్తకుల । సోముఁడు; దీనదయాపరత్వశ్రీ
రాముఁడు; దుష్టదానవవి । రాముఁడు; రాముఁడు వింటివమ్మరో॥

వెండియు,

సీ॥ సీమనోహరుని, పి । సిలకుంతలములు
జటిలంబులై మెను । జటలుగాఁగ
జానకీరాముని । శ్యామలాంగంబున
కాషాయవస్త్రముల్ । కనిపించెలంగ
కోదండపాణికి । కూర్చిరమ్యగాటవీ
స్థలియెసిర్మిత పర్ణ । శయ్యగాఁగ
కౌసల్యసుతునకు । కందమూలాదులే
షడ్రసోపేత భో । జనముగాఁగ

గీ॥ వాలిసంహరించి, కిష్కింధ । పట్టణమును
కమలమిత్రుని సుతునకుఁ । గట్టఁబెట్టి
రేయిఁ బవలొక్క మొగిజాన । కీ! యటంచు
పొగిలెదుఃఖించుచుండు, రా । ముండుతల్లీ!॥

ఇఁక లక్ష్మణుఁడో, వర్ణమునందు భేదముఁగలవాఁడుగాని, తక్కిన లక్షణములన్నియు రామునిఁబోలియుండును. అగ్రజుఁడు కన్నతండ్రియను శాస్త్రము, తానాచరణలోఁ బెట్టియున్నాఁడు. ఇంకేమని చెప్పఁగలను? తల్లిరో! ఇంతకును నన్ను నమ్మవైతివేని, శ్రీరాముదాంగుళీయమిది గైకొనియైన, నన్ను నమ్మెదవుగాక. (ఉంగరమిచ్చును.)

సీత—(ఉంగరమందుకొని కన్నులనద్దుకొనుచు సంతోషముతో) ఆహా! నేనెంతధన్యను! భళిరే నాభాగ్యము! ఓరామాంగుళీయకమా! నేఁటికి నాయందు దయఁగలిగెనా? నాచెఱవిముక్తికి, నేనేకారణమని సూచింపవచ్చితివా?

రామచంద్రుఁడు నీతో నేమని వచించెను? నాజాడఁ గానరాక రామానుజు
లహోరాత్రములు విషాదసాగరనిమగ్నులై పరితపించుచున్నా రనియా?
ముద్దుటుంగరమా! ఎన్నిదినములకింక సీతారాముల నొకటిఁ జేసెదవు?
ఏమంటివి? శుభముహూర్తము నిర్ణయించి చెప్పెదననుచుంటివా? చెప్పుము.
రాఘవునితో నాదురవస్థ వర్ణించి చెప్పుము. రాక్షససంహార మొనర్చి త్వరి
తముగ నన్నుఁ దోడ్కొని పొమ్మనుము. ఆహా! నిన్నుఁ జూడ దుఃఖము,
దుఃఖముతోఁ గూడిన సంతోషము నేకమై, యానందాశ్రువులఁ గురిపించు
చున్న, నీఋణ మీజన్మమునఁ దీర్చుకొనలేనుగదా? (కన్నుల నద్దుకొ
నును) తనయా! ఆంజనేయా!

క॥ అన్నా! రాముఁడు సుఖియై
యున్నాఁడా? భక్తిశ్రద్ధ లొప్పుచు శ్రీరా
మన్నం గూడి నిరంతర
మున్నాఁడా? లక్ష్మణుండు ను గ్రోవుల౯॥

ఆంజ——తల్లిరో! శ్రీరామలక్ష్మణులు సుఖముగా నున్నారు. రామానుజులు నిన్ను
వెదకించిన వారుకారు. నీజాడఁ దెలియక నహర్నిశములు చింతాక్రాంతు
లై యున్నారు. మారామయ్యతండ్రి నీవియోగమున కేవలముఁ బిచ్చివాఁ
డై, క్రమముగ వానరసఖ్యమున నిప్పుడిప్పుడు దుఃఖమును దిగమ్రింగి,
నీజాడకై యెదురు జూచుచున్నారు. అమ్మరో! నేటికి నీవార్త దెలిసినది.
రామలక్ష్మణు లనుపావనవైశ్వానరుల కీలంకారాజ్య మాహుతికాఁ గలదు.
ఇంకఁ గొలఁదిదినములలో నీశోకాగ్ని చల్లారి, దానవాంగనలశోకారవంబు
లతో నీలంకాపట్టణము ఘూర్ణిల్లఁగలదు. ఇంతకుముందు దుష్టరావణుఁడు
నిన్నాడినమాటలకు వాని కంఠనాళములు జీల్చియుందునుగాని, రామాజ్ఞ
లేనికతమున వ్యర్థుఁడనైతిని.

ఆంజ——మారుతీ! నీవంటి మహోదారపుత్రుఁ డుండ నాకేమి కొఱంత? నీయుప
కారభరమును జన్మజన్మాంతరములుగూడ మఱువఁజాలను. నీపరిశుద్ధ
మానసమెఱుంగక సందేహించి, దూషించినందులకు మాత్రము నన్ను
మన్నింపుము.

ఆంజ—తల్లీ! ఎంతమాటంటివి? నీవే నన్ను మన్నించి కర్తవ్యముఁ జెప్పుము?

సీత—హనుమా! ఏమని చెప్పుదును? నాయరణ్యరోదన మింకెంత కాలమో కదా ?

ఆంజ—అమ్మరో! నీకు నేఁడే విషాదాంతము. ఇదె నాభుజముల నధిరోహింపుము. క్షణకాలములో నిన్ను రామసన్నిధానమునకుఁ జేర్చెద. పిమ్మట, మేమందఱము రామానుజులంగూడివచ్చి, లంకానగరము బూదిగావించెదము.

సీత—అన్నా! ఎంతవెఱ్ఱివాఁడవోయీ! అల్పశరీరివగు నీవు, నన్ను వాయువేగమున గొంపోవువేళ, జారి సముద్రమునఁబడినఁ బడవచ్చును. లేదేని, రాక్షసు లడ్డగించిన, కార్యము మొదలంట నశించిపోవునుగదా ?

ఆంజ—దేవీ? నీకు మారుతి సామర్థ్యమెఱుఁగ లేకపోతివిగదా? శ్రీరామానుగ్రహమున్న, రాక్షసులే కాదు, చతుర్దశభువనములెత్తివచ్చినను నరకసేయుదు సుమా? నన్ను సామాన్యవానరునిఁగఁ దలంపకుము. తల్లీ! ఇదె నావిశ్వరూపముఁ దిలకింపుము. (విశ్వరూపప్రదర్శనము)

సీత—(భయాశ్చర్యములతో) వాయునందనా! నీవిశ్వరూపప్రదర్శన మింకఁ జాలింపుము. నాకు భయాశ్చర్యములుఁ గలిగించెడిని.

ఆంజ—(యథారూపముతో) తల్లిరో! ఇప్పటికైనఁ బుత్రునిఁ గరుణించితివా?

సీత—కుమారా! నీస్వరూపమే సందియనివారణమైనది. నీవు సురాసురుల కేని యజేయుఁడవు. కాని, నాకొక వ్రతనియమముఁ గలదు. అదేదియన, రాముని కరస్పర్శభాగ్యముఁ దప్ప, వేఱొక పురుషశరీరము నంటఁజాలను.

ఆంజ—మాతా! మహాపతివ్రతాశిరోమణివగు నీయభిమతమే నెఱవేఱుఁగాక. అచిరకాలములో రామానుజులఁ దోడ్కొనివచ్చెద. నాకనుజ్ఞనిమ్ము. రాములకు శుభవార్తఁ జెప్పుము.

సీత—నాయనా! ఏమని చెప్పుదును. నీకన్నులార రావణుని చర్యలుఁజూచి యున్నావుగదా? పెండియు రెండుమాసములు మాత్రమే గడువిచ్చియున్నాఁడు. అంతవఱకెట్లో గడిపెద. కాని, శతయోజనవిస్తీర్ణమగు సముద్రమును గపులతోఁగూడి రామానుజులెట్లు రాగలుగుదురాయని సంశయింపుచున్న దానను.

ఆంజ—జననీ! ఎంతవెఱ్ఱితల్లివమ్మా! వానరులు దేవాంశసంభూతులుఁ గాని, వేఱుగాదు. నాకంటెఁ బ్రతాపవంతులు లెక్కకు మిక్కిలియున్నారు.

శ్రీరామానుగ్రహమే కార్యసాధనము. నీవింక శంకఁదక్క, శ్రీరామచంద్రు
నకానవాలేమైన నిచ్చి నన్నుఁ బంపించుము.

సీత—అంజనీతనయా! రామచంద్రునితో, దయాసాంద్రునితో, భక్తచింతామ
ణితో, అయోనిజహృదయకములనివాసునితో, నిట్లని వచింపుము.

సీ॥ రామ! రామా! యంచు । రాత్రింబవళ్ళును
నిన్నె స్మరింపుచు । నున్నదనుము
నినుఁ బాసినది మొదల్ । దిన మొకయుగమౌటఁ
గన్నీటిధారలఁ । గట్టువనుము
నీ వెప్పుడే వేళ । నో వచ్చి రక్షింపఁ
గలవంచు, జీవించి । నిలచెననుము
క్షాత్రధర్మముగ, రా । క్షసరాజునిఁ జంపి
దారను గొంట, కీ । ర్తివ్యమనుము

గీ॥ రెండు నెలలింక జీవించి । యుందుననుము
హర ధనుర్భంగ కారణ । మరయుమనుము
గడువుదాటినచో విప । త్కాలమనుము
శరణమేగిన దీనకు । దక్కదనుము॥

ఇదె నా శిరోమాణిక్యము. ఓమాణిక్యమా! నీవింక రాముని హస్తమలంకరించి,
సీతారామవియోగదావానలముఁ జల్లార్పఁ బ్రయత్నించి, దానవసంహా
రమునకు దారిఁజూపించి, రామానుజును వెంటనే తోడ్కొనిరమ్మనుమా!
మారుతీ! ఈమాణిక్యము స్వీకరింపుము? (వానికిచ్చును)

ఆంజ—(పుచ్చుకొని) తల్లీ! పోయివచ్చెద. ఇదె నావందనమందుకొనుము.

సీత—అభీష్టసిద్ధిరస్తు. కుమారా! విజయశీలుఁడవై పోయిరమ్ము.

ఆంజ—చిత్తము. (నడచుచుండఁగఁ దెరపడును)

---

## తృతీయ దృశ్యము రావణసభామంటపము.

[రావణుఁడు, విభీషణుఁడు, ఇంద్రజిత్తు మొదలగువారు కూర్చుండి
యుందురు. వాలము బెంచుకొని యాంజనేయుఁడు కూర్చుండును.]

ఇంద్ర—ఓరీ! వానరా! మదీయ బ్రహ్మాస్త్రమున బద్ధుఁడవైన పందవు. వాలముఁ
బెంచుకొని, నా తండ్రి సింహాసనమ్ముకంటె నెత్తుగఁ గూర్చుండుటకీవర్హుఁడవు

కావు. నీజాతి లక్షణమును జూపించుకొనక, సకల లోకములకు ప్రభువగు రావణచక్రవర్తి పాదపంకేరుహములకు నమస్కరించి ప్రాణములుండఁ జూచుకొనుము. లేకున్న నన్నెఱుంగుదువుకదా ?

ఆంజ—ఓయవివేకీ! నీమాటలుండనిమ్ము. ప్రభువనుశబ్దము మీ రావణునకుఁ జెల్లదు సుమా! నిరంకుశాధికారమునఁ బ్రజల బాధించువాఁడు పశుప్రాయుఁడు గాని, ప్రభువగునా? నీతండ్రి లోకాపకారి కావున ప్రభునామము వానికిఁ జెల్లదు. కావున, నేనే వానికంటె నధికుఁడను. రామదూత రాక్షసాధములకు మ్రొక్కువాఁడు కాఁడుసుమా !

రావ—(కోపముతో) అరే దురాత్మా! వానరా! అస్మత్ప్రతాపశౌర్యాదు లెఱుఁగియున్నచో, నీవు నాపాదములపైఁబడి శరణుగోరకుందువా? రావణుఁ డననేమనుకొంటివిరా ?

సీ॥ భుజవిక్రమంబునఁ । బూలచెండు విధంబుఁ
కైలాసమెత్తిన । ఘనుఁడనేనె

ఆంజ— వాలితోకనుగట్టు । వడి, వార్ధులంద్రోయఁ
జచ్చినట్లుండిన । చవటవీవె

రావ— దిక్పాలకులను బం । ధించి, త్రివిష్ట ప
థము నాక్రమించిన । ధన్యుఁడేనె

ఆంజ— కార్తవీర్యార్జును । కారాగృహంబునఁ
బడిచచ్చియున్నట్టి । పందవీవె

రావ— పాశపాణిని గెల్చి । పాపలోకంబును
పాలించుచున్నట్టి । ప్రభువునేనె

ఆంజ— శ్వేతఖండముఁజొచ్చి । వెలఁదులచేఁజిక్కి
శరణుఁగోరిన నపుం । సకుఁడవీవె

రావ— సూర్యచంద్రులనేని । శూరత్వమునఁగెల్చి
శాసించుచున్న శా । శ్వతుఁడనేనె

ఆంజ— మగటిమిఁ గోల్పోయి । మాంధాతచేఁజిక్కి
మూలడాగిన యధ । ముండవీవు

రావ— గీ॥ త్రిభువనంబుల దేవాది । దేవుఁడనె

ఆంజ— క్రూరకర్ముఁడ! లోకాప । కారివీవె

రావ— ధిక్కరింపకఁ, బదములకు మ్రొక్కుమోరి
ఆంజ— మ్రొక్కుకొనుమీవె, నీకరంబులు మోడ్చి॥

రావ—(మహాకోపముతో) వానరాధమా! ఇదె చచ్చితివి. కాచుకొమ్ము. (వానినఱకఁబోవును.)

విభీ—అన్నా! రావణా! రాక్షసధర్మజ్ఞుఁడవగు నీకు వేఱుగఁజెప్పవలయునా? దూతను జంపరాదను నీతిశాస్త్రముఁ జదువలేదా? ప్రభువులాజ్ఞను సారముగ దూతలు వాకొనుచుందురు. అది వారితప్పుగాదు. వీనినిక్కడనే చంపిన బ్రయోజనమేమి? దూతను మధ్యమార్గమునఁజంపుట మహాదోషము. మితిమీరి కారులాడినదూతలకుఁ గొన్నిశిక్షలు లేకపోలేదు. ఇతఁడు కోతి కావున, తోఁకఁ దెగఁగొట్టుట, లేక నిప్పుముట్టించుట రెండేకార్యములు.

రావ—తమ్ముఁడా! చక్కని మార్గము జూపించితివి. ఎంతయు ధర్మయుక్తము. వానరులకు వాలమే ముఖ్యము. కావున, వాలముఁ గాల్చి పంపించెదము. దనుజులారా! వీనివాలమునకు వస్త్రములు జుట్టి, తైలముఁబోసి, నిప్పంటించి వదలిపెట్టుఁడు. త్వరితముగఁ బొండు.

రాక్షసులు—చిత్తము. (కోతిని పట్టుకొందురు.)

(యవనిక జారును.)

---

చతుర్థ దృశ్యము, లంకాపురవీధి.

[రాక్షసులాంజనేయునితోఁ బ్రవేశము.]

1 రాక్షస—కోతివాఁడా! ఇంక నీపొగరడంగఁగలదు.

ఆంజ—మీపొగరడంగిన తరువాత.

2 రాక్షస—ఓరీ—ఇప్పటికైన మా రాజేంద్రునకు మ్రొక్కెదవా? నీవు బ్రతికెదవు. ఏమందువు?

ఆంజ—నేను మ్రొక్కఁబోను. మీరు నాబారినుండి దక్కఁబోరు.

3 రాక్షస—వీనితో మాటలేల? తోఁకకగ్గి ముట్టింపుఁడు. అప్పుడుగాని తెలియదు.

ఆంజ—అవును. అప్పుడుగాని నాసంగతి తెలియదు. మీపని త్వరగ గానింపు.

రాక్షసు—ఇదె చూడుము. (వానితోఁక కగ్ని ముట్టించి చప్పట్లు గొట్టుచు గేకలు వేయుచుందురు.)

ఆం:—రాక్షసులారా! మీపని యైనదికదా?

రాక్షసు—ఆ. ఇంకనిచావొక్కటేతక్కువ. నీవీబంధమందుండి విడిపించుకొనలేక, నెటుల గిలగిల తన్నుకొని చచ్చెదవో యని చూడనున్నారము.

ఆం:—అటులనా? అవి యూడకున్నమాని, ముందు మీప్రాణములూడకుండు నట్లు గాపాడుకొనుఁడు. (తన శరీరము విదలింప బంధనము వీడిపోవును.) దురాత్ములారా! ఇఁకనాప్రతాపాగ్నిఁ జూడుఁడు. (అని వారలఁ జావఁగొట్టి) ఏమీ యాశ్చర్యము! అగ్నిదేవుఁడు నాతండ్రికాప్తుఁడగుటవలన, నాకావంతయునగ్ని బాధఁ గలుగఁజేయక చక్కని శీతలత్వముఁ గలిగి యుండును. కాదు కాదు. ఇదంతయు సీతారాముల యనుగ్రహము. ఇంక నాలసింపనేల? నేను వచ్చి నందులకు గుర్తుగ లంకానగరమంతయు దహించి పోయెదఁగాక. (పురవీధులం గాల్చుచు లోనికేగి మరలఁ బ్రవేశించి) దావాగ్నికీలలతో లంకానగరము భస్మీపటలమగుచున్నది. పట్టణమంతయు హాహాకారారావములతోఁ బ్రతిధ్వనులీనుచు పాడువాఱినది. నాకార్యము సమాప్తినొందెను. సముద్రమున నగ్నిఁ జల్లార్చుకొని శ్రీరామ సన్నిధానమునకుఁ బోయెదఁగాక.

(నిష్క్రమించును.)





శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సంపూర్ణ రామాయణము.

## షష్ఠాంకము.

---

### ప్రథమదృశ్యము—మాల్యవంతము.

[రాముఁడు, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు, ఆంజనేయుఁడు మొదలగు వానరులు ప్రవేశము]

రాము—(సంతోషముతో) హనుమా! సీతాదేవి శుభవార్తఁ జెప్పినదేగాక, నామె శిరోమాణిక్యముఁగూడ నాసమూలకుఁ దెచ్చి నాకిచ్చిన నీభక్తివిశేషములఁ గొనియాడఁ దరముఁగాదుగదా! అనల వృత్తాంతమేమి?

ఆంజ—చిత్తము దేవా! మేఘనాదుని బ్రహ్మాస్త్రమునకేనుఁ గట్టువడి పరదారాపహరణ మహాపాతకంబగుట, రావణు నాస్థానమునలంకరించి, వానిని సరకుసేయక నయభయంబులనెంతయో నీతి గఱపితిని. దురాత్ముఁడు నావాక్యములు చెడచెవింబెట్టి పటురోషభీషణదుర్నిరీక్షుఁడై, చంద్రాయుధము నాపై నెత్తఁబోయెను. అంత, వానిసోదరుఁడగు విభీషణుఁడు వారించి, ధర్మములుపదేశించి, దూతను జంపఁగూడదని బోధింప వల్లెయని, మదీయవాలంబు ననలార్పితంబు గావింపుఁడని రాక్షసేంద్రుఁడు శాసించెను. రక్కసులు నావాలమునకగ్నిముట్టించిరి. మీకృపావలోకనమున నగ్ని నన్ను దహింపకుంటచే, వచ్చినందులకు మచ్చుఁజూపించి పోవుట శూరులలక్షణమని లంకాదహన మొనరించి మీసన్నిధానమునకరుదెంచితిని? ఇదియె వృత్తాంతము.

రాము—లక్ష్మణా! నాధనుర్బాణ తూణీరముల నిటఁదెమ్ము. నేనొక్కండనె బోయి లంకానగరము భూపతితముఁ గావించి జానకినిఁ దోడ్కొనివచ్చెద.

సుగ్రీ—రామచంద్రా! మీకుశ్రమయేల? ఈదాసుండు లేఁడా? సమస్తవానరానీకముతోఁ దండువెడలి దశకంఠలుంఠన మొనర్చి మాయమ్మను గొనివచ్చెద.

అంజ—దేవా! మీయనుజ్ఞ లేక మఱిడివచ్చితినిగాని, యశోకవనముతోఁగూడఁ బెల్లగించి, నాతల్లినిటకుఁ దోడ్కొని రాకుందునా? ఇప్పుడైన మించినదేమి? రామశరాగ్నిజ్వాలాహుతిగానలయుచున్న లంకాపట్టణముఁ జేరుటే ముందు కర్తవ్యము.

లక్ష్మ—అదియే ముందు నిశ్చయింపవలసినది.

రాము—సుగ్రీవా! ఏదికర్తవ్యము?

సుగ్రీ—దేవా! దుర్వార కల్పిపాంసు సేంద్ర మూరణమునకు సముద్రమున వారధిఁ గట్టుట యవశ్యము.

(లోపలనుండి, శ్రీరామచంద్రా: మాంపాహి మాంపాహి.)

రాము—సుగ్రీవా! ఆర్తుఁడెవ్వఁడో "పాహి పాహి" యని నన్ను వేఁడుకొనుచున్నాఁడు. పోయి చూచిరమ్ము.

సుగ్రీ—(లోనికేగి మరలవచ్చి) రామచంద్రా! దైత్యుఁడొకఁడు తన పరివారము లను వెంటఁబెట్టుకొనివచ్చి, మిమ్ముశరణుఁ గోరుచున్నాఁడు.

లక్ష్మ—ఏమీ! రాక్షసుఁడా! నేఁబోయి వానిని తుదముట్టింపఁ జేసెదను.

రాము—వీరులారా! త్వరపడకుఁడు. రాక్షసుఁడైన మఱెట్టిడైన శరణార్థిని రక్షించుట కర్తవ్యము. అంగదా! నీవుపోయి వానినిటకుఁ గొనిరమ్ము.

అంగ.—చిత్తము. (లోనికేగి విభీషణునితోఁ దిరిగి ప్రవేశము)

విభీ—

సీ॥ సీతామనఃకామ! । శ్రితరక్షణోద్దామ!
పరశురామ విరామ! । శరణు శరణు
నీలనీరదగాత్ర । నిర్జరాదిస్తోత్ర
జ్వలనార్క-శశినేత్ర । శరణు శరణు
సుగ్రీవ పరిరక్ష! । సురవైరికులశిక్ష
కరుణాంచితకటాక్ష! శరణు శరణు

వాలిమర్దనవీర । పాలితమునిదార
శరణాగతులోద్ధార ! । శరణు శరణు

గీ॥ చండఖరదూషణ విదార ! । శరణు శరణు
దురితమారీచ సంహార ! । శరణు శరణు
చటులహరచాప ప్రవిదార ! । శరణు శరణు
శరణు శ్రీరామ ! రఘురామ ! । శరణు శరణు॥

(రాముని పాదములపైఁ బడును)

రాము—(వానిమూర్ధమున చేయిబెట్టి)

ఉ॥ ఇచ్చితినార్యుఁడా ! యభయ । మిచ్చితి నాతలిదండ్రులాన; నీ
వెచ్చటనుండి వచ్చితివి ? యెవ్వఁ । డు నీకపకారి ? వాని నా
మొచ్చరణంబు సేయుము, మ । హోదధిఁ జాగెన; స్వర్గలోకముం
జొచ్చిన; వానిమస్తకముఁ । జూర్ణముఁ జేసెద నిన్నుఁ గాచెదన్॥

(వానివీపుపైఁ జఱచును.

సుగ్రీ—రామచంద్రా ! ఇతఁడు రాక్షసుఁడు. విచారింపక నభయమిచ్చుటఁ దగునా యని మా ప్రార్థన.

లక్ష్మ—అన్నా ! ఇతండు మారీచవంశజుఁడై, శత్రుక్షేమముఁ దీర్చుకొనవచ్చిన మాయావియని నాకనుమానము.

రాము—ఎవ్వఁడైననేమి? మనల శరణుగోరినవాఁడు మనకాప్తమిత్రుఁడు. కృత్రిమవేషధారులు నాకరస్పర్శమాత్రముననే భస్మీపటల మగుదురుసుమా ! అయ్యా ! ఇంక నీభయకారణ మేమియో చెప్పుము. నీవెవ్వఁడవు ?

విభీ—శ్రీరామచంద్రా ! దురాత్ముఁడగు రావణానుజుఁడను. విభీషణనామధేయుఁడను.

సుగ్రీ—హనుమా ! నీకుఁ దెలియనిదేమున్నది. ఇతఁడా విభీషణుఁడని దృఢముగ జెప్పఁగలవా ?

ఆంజ—అయ్యా ! సుగ్రీవా ! మహాత్మా ! రామా ! వీనిని నేనెఱుంగుదును. ఇతఁడు ధర్మబద్ధుఁడు. నీతివిశారదుఁడు. దైత్యకుల భూషణుఁడు. ఈవిభీషణుఁడు శ్రీరామ పక్షపాతియై, రావణునకు ధర్మోపదేశముఁ జేయ, నతండీపురాజ్యుని

ధిక్కరించి యవమానించి యుంచును. కావున, నిశాటేంద్రయు రామానుగ్రహపాత్రుఁడు.

రాము—విభీషణా! ఇంక నీదీనచరిత్రము వినిపింపుము.

విభీ—సీతారామా! మారుతి వచించినట్లు, రావణుఁడు కుపితమానసుఁడై వైరనామోచ్చారణ పాతకుండవగు నీమొగముఁ జూడరాదని నిండోలగంబున తన వామపాదాహతి నన్నుఁ దన్నెను. వెంటనే వాని లంకారాజ్యమును వాసిని శపించి, విష్ణ్వంశ సంభూతులగు మిమ్ము దర్శించి, యనుగ్రహము సంపాదించి, తరింపవలెనని ప్రార్థింప వచ్చితిని.

రాము—పౌలస్త్యా! నీవింతకాలమునుండి మాకు బరమాప్తుఁడవైతివి. కొలఁది దినములలో నిన్ను లంకారాజ్యమున నభిషిక్తునిఁ గావించెదఁగాక.

విభీ—మహాత్మా! ధన్యుండను.

రాము—సుగ్రీవా! ఎల్లి సూర్యోదయమున దర్భశయనుండనై సముద్రునారాధించి ప్రసన్నునిఁ గావించుకొని వారిధిగట్టునుపాయ మరసెదను. మీరలేపుడే దత్ప్రయత్నముల నుండుఁడు. సంధ్యాకాలమైనది. కాలోచితకృత్యములు దీర్చుకొనవలయును. పోవుదము రండు.

సుగ్రీ—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

---

ద్వితీయదృశ్యము—సేతుబంధనము.

[లంకాపరిసరారణ్యభూములు వానరానీకముతో శ్రీరామలక్ష్మణుల ప్రవేశము]

రాము—వానరేశ్వరా! శతయోజన విస్తీర్ణమగు సేతువు స్వల్పకాలమునఁగట్టి సమస్త వానరానీకముతో దాఁటు వెడలిన భవత్సామర్థ్యము ప్రశంసనార్హము గదా?

సుగ్రీ—దేవా! భవత్కృపారస పాత్రులగు ధన్యాత్ముల కసాధ్య మొండుఁగలదా?

రాము—వీరులారా! మనకిప్పుడు కర్తవ్యమేమి?

లక్ష్మ—అగ్రజా! మంత్రాలోచనా దక్షుఁడగు విభీషణుఁ డున్నాఁడుగదా?

రాము—అవును. దైత్యకులభూషణా! విభీషణా! ఇప్పుడు నీయభిప్రాయమేమి?

విభీ—మహాత్మా! చతురోపాయంబు లవనీశ్వరుల కవశ్యాచరణీయములు. కావున,

దైత్యేశ్వరుని చెంత కొకదూతను బంపించి, సామంబున మరల బోధించుట
లెస్సగదా ?

లక్ష్మ—విభీషణుని యభిమతము సమంజసము.

సుగ్రీ—దేవా! అందులకు మనయంగదుఁడే తగినవాఁడు.

రాము—మంచిది. తారాత్మజా! నీవా రావణుని సందర్శించి.

మ॥ అవనీదుర్భర భారకుండవగు ని । న్నాలంబునం గూల్పఁగా
దివిజారాతికులాటవీదహనుఁడే । తేరన్ మహాభీకశా
ఘనశాఘుండయి వార్ధిగట్టె; వెనసీ । తాదేవి నర్పించి రా
ఘవు నర్చింపుము; శ్రీనివాసమగు లం । కారాజ్యమున్ మాపకన్॥

అని వచించిచూఁడుము. అందులకతఁడు వ్యతిరిక్తముగ బలికెనేని, సీతాపహరణో
ద్యోగలంపటుఘూయిష్ఠుఁడవైన నిన్ను అస్మద్విలయానలాభీలసదృశఘో
రాశుగోగ్రానలచ్ఛటల నాహుతి జేసెదనని నొక్కి వక్కాణించి, వెడలి
రమ్ము. సుగ్రీవా! నీవింక స్వసైన్యముతో లంకారాజ్యోన్ముఖుండవుకమ్ము.
హనుమా! మా యావులకు రాక్షసవ్యాపారముల నప్రమత్తుఁడవైన నీవా
రయుచుండుము. ఇంతలో నంగద రాయబారము తేటతెల్లము గాఁగలదు
అంగదా! నీవింకఁ బోయిరమ్ము.

అంగ—చిత్తము.

(యవనికజారును)

---

తృతీయదృశ్యము—రావణుని యాస్థానము.

[రావణుఁడమాత్యులతో నుచితాసనములఁ గూర్చుండియుండ, నంగదుఁడు
నిలువఁబడి యుండును]

రావ—ఓరీ? వలీముఖార్భకా! నీవెవ్వఁడవు?

అంగ—వలీముఖవిభువిధేయా! చెప్పెదవినుము. జగదేకవీరుండనని విఱ్ఱవీగిన
నిన్ను, భుజస్కంధమున నిఱికించుకొని, చతుస్సముద్రముల ముంచి, కొన
యూపిరితో విడిచివేసిన వానరచక్రవర్తియగు వాలికిగారాబుబిడ్డఁడ. మా
రీచమథనుని సందేశహారుఁడ.

రావ—ఓరీ! నిన్నిక్కడ కెవరురానిచ్చిరి?

అంగ—నాకొకరి యాజ్ఞయేల? నాకు నేనే వచ్చితిని.

రావ—ఎందులకు?

అంగ—రామసందేశహారుఁడనై వచ్చియుంటినని చెప్పలేదా?

రావ—ఓరీ! రాముఁ డేమనియెను.

అంగ—ఓరీ! సావధానుండవై వినుము.

సీ॥ మాయావియై, భువి । మడసిన మారీచు
చర్మమే మృదుతర । శయ్యఁగాఁగ
కిష్కింధనేలు సు । గ్రీవుఁడర్కిశల్
వీక్షానుసారియై । మెలఁగుచుండ
లంకాపురంబు స । శ్శంకఁగాల్చిన ధీరుఁ
డంజనీసుతుఁడు తా । నడుగులొత్త
రాక్షసవ్యూహ మా । రణహోమ విశిఖ పా
తము లక్ష్మణుఁడు పరిపా । తంబుసేయ

గీ॥ రాక్షసావళి మాయ మ । ర్మంబులెల్ల
శరణుగోరిన మీ విభీ । షణుఁడు నుడువ
రఘుకులాంభోధి చంద్రుఁడు । రాఘవుండు
నవ్వుచును గొల్వుదీరి యు । న్నాఁడు నేఁడు॥

రావ—ఓయీ! ముందు నిన్నిక్కడకుఁ బంపిన కారణమేమి?

అంగ—సీతతోఁ గొన్ని మాటలాడుమని. ఏమనిన,

సీ॥ సీతాపహరణంబుఁ । జెల్లదు, నీయట్టి
దోష్మంతునకుఁ గడు । దోషమనియె
అపరాధమంచును । నవనిజనర్పించి
కరములుజోడింప । ఘనతయనియె
కాదేని, యస్త్రశ । స్త్రాదులఁ జేఁబట్టి
తలఁగక ననిసేయ । నిలువుమనియె

గీ॥ మెచ్చి, నీ తపమున కజుఁ । డిచ్చినట్టి
శాశ్వతవరంబు నిన్నోమఁ । జాలదనియె
నాలమందు మహేశ్వరుఁ । డడ్డుకొనుచుఁ
దగవుమాలిన నీచావు । దప్పదనియె॥

రావ—ఓయవివేకీ! ఈసందేశముల కేమిగాని, నీతండ్రినిఁ జంపిన నీబాధముని గొలిచి యపవిత్రుఁడ వేలకావలయును. పత్ర్యాణ విముక్తికై నాయందుఁ జేరుము. నిన్నా కపికులమున కధినాథునిఁగఁ జేసెద.

అంగ—కైలాసముక్రింద నడఁగి ప్రాణావశిష్టుఁడవైన నీవొక యధమాధముఁడవు గాదా?

రావ—దురాత్మా! వెనుకటి కోతిగతియే నీకును బట్టగలదుసుమా?

అంగ—దుర్మదాంధా! అతఁడు నీతలఁ దన్నిసవాలుఁ గినుకనే, నీలంకానగరమంతయు దహించి వచ్చినాఁడు.

రావ—వదరుఁబోతా! ప్రాణము లుండఁజూచుకొని మాటాడుము.

అంగ—అయ్యది దేవుఁడెఱుఁగు. సీతాదేవి నిచ్చెదవా? లేదా?

రావ—మీరుఁ జచ్చినవెనుక.

అంగ—రాక్షసా; ముందు నీచావు నెఱుంగలేకున్నాఁడవు.

చ॥ కపులు మహోగ్రసింహములు । కైవశి పైఁబడి నీదుసైన్యమున్
తపఁదపఁ దాకపండ్లవలె । ధారుణిఁ గూల్చకమున్నె; నీతలల్
కుపిత రఘూద్వహాస్త్రముల । కున్ ఫలహారముఁ గాకమున్నె; నీ
చపలతవాయునా? పొగరుఁ । జచ్చునె? మూర్ఖము వీడిపోవునా?॥

రావ—ఓరీ! దుర్మదాంధా! వీవింకఁ జచ్చితివి. రాక్షసులారా! వీనిని బంధింపుఁడు.

అంగ—ఓరీ! రామాజ్ఞ లేదుగాని, నీసైనికులగాదు. నీతలఁదన్ని పడఁగొట్టకుందునా?

(తెరలో) పట్టుఁడు. కొట్టుఁడు.

అంగ—ఇదె నాపరితాపముఁ జూడుఁడు. (అందఱును చిందరవందర జేసి పారిపోవును)

(యవనికజారును)

---

చతుర్థ దృశ్యము—యుద్ధభూమి.

[ధనుష్పాణియై యింద్రజిత్తు ప్రవేశము.]

ఇంద్రి—ఆహా! నిఖిల నిర్జరసంఘ విచ్ఛేదనుండనై, జంభారిని జెఱఁబట్టి గర్వభంగ మొనరించిన మదీయ శరవర్షధారాపాతంబునకు వెఱవక, వెన్నీయక, నిలచి పోరాడిన నరవానరులెంతయు మెచ్చఁదగిన వారలేసుమా?

గీ॥ ధీరభయదాచలేంద్రస । దృశులు కపులు
అరినానీకనాశన । కరులు నరులు
నిశిత శరచాపపాణులై । నిలచిరేని
గెలువఁ జాలరు హరిహరా । దులు నిజంబు॥

వీరట్టి వీరాధివీరులనియే, దుర్మదోద్రేకులై లంకాపురీ దుర్గంబుల కెగఁబ్రాకి రక్షో వీరులఁ జెక్కుఁ జెక్కు బ్రహాతమార్చిన వానరసైన్యమును, విలయకాలాగ్ని పిడుగులగు రామలక్ష్మణులను, నాగపాశబద్ధులఁ గావించి పసదూల్చితిని. కాని మఱుదినమే బంధవిముక్తులై, మరల హోరాహోరిగఁ బోరాడుచు, రక్కసులఁ జిక్కుచుచునుండ నుక్కడంచుచున్నారు. నేనింక నిధాయాధుఁడనై గగనమండలమున కెగసి, మేఘముల చాటునుండి, క్రూరనారాచ పరంపరలు విజృంభింపఁ జేసి నేఁ డితో నరవానరుల నంతమొందించి తీరెదఁగాక.

( తెర లో )

మేఘనాదా! నరవానరుల దాడి కోర్వలేకున్నాము. రక్షింపుము. రక్షింపుము.

ఇంద్ర—రాక్షసులారా! వెఱువకుఁడు. నేనిదే రణరంగము నలంకరింపఁ బోవుచున్నాను. వారి పటాటోపమింకఁ బటాపంచలుగాఁ గావించెదఁ జూడుఁడు. (రథమధిష్ఠించి నిష్క్రమించును.)

(లక్ష్మణుఁడు శరచాపములుధరించి ప్రవేశము.)

లక్ష్మ—(కోపోద్రిక్తుఁడై) ఓ వానర సైనికులారా! భీతిల్లకుఁడు. అసమర్థుఁడై, మేఘముల చాటునుండి కృత్రిమ రణకౌశలముఁ బ్రదర్శించుచున్న మేఘనాదు నిదే మదీయ దారుణాస్త్ర ప్రయోగంబున విగతజీవునిఁ జేసెదఁగాక.

విభీ—(ప్రవేశించి) రామానుజా! దారుణాస్త్రము మేఘనాదునిఁ బొలియింపఁజాలదు. ఆదురాత్ముని ప్రాణాపహరణమున కొంత రహస్యముఁగలదు. మీ యధీనమైయున్న యాంగీరస బాణముఁ బ్రయోగించితిరేని, యాదుండగీఁడు భగ్నరథుండై భూమిపైఁ బడును. వెంటనే, భవదీయ బాణాభీలకీలికా జాలంబుల నాపాపాత్ముని భస్మంబు జేయవచ్చును.

లక్ష్మ—విభీషణా! అట్లే యొనర్చెదను. (పైఁజూచి) అరే! దురాత్మా! అసురకులాధమా! ఇంకెందుఁ బోయెదవురా?

గీ॥ పరభయంకర కృత్రిమ । ప్రథితజన్య
విజయ? యుష్మద్భుజాటోప । విక్రమమింక
న్వ్యర్థమై, భగ్నరథుఁడవై । యవనిఁ గూలఁ
గలవు, యాంగీరసమగు పృ । షత్కమిదిగో!॥

(బాణము విడువ భగ్నరథుఁడై యింద్రజిత్తు భూమిపైఁ బడును)

ఇంద్ర—(లేచి) ఏమి యాశ్చర్యము? ఆంగీరసబాణప్రయోగంబునఁ బయల్పడు మదీయ రణవ్యాపారకృత్రిమ మీ నరుండెట్లు గ్రహించెనో కదా? (తిరిగి చూచి) హా! ఇంకేమున్నది? రాజద్రోహియగు విభీషణుఁడే యింతఁ జేసెను. (కను లెఱ్ఱఁ జేసి) ఓరీ! రాజద్రోహీ! భ్రాతృద్రోహీ!

గీ॥ కులముఁ జెడఁబుట్టి, పరవాన । రులను గొల్చి
దాహమారక, నా పిన । తండ్రివయ్యు
మర్మములు దేటఁబఱచి, న । మాయ మాన
కొండెనగు నిన్నుఁ జంపెద । నుండు మోరి!॥

విభీ—ఓరీ! గర్వాంధకారసంచారా! నాఁడు నీతండ్రితోఁ బాటు నీవును నన్నధిక్షేపించి దిక్కుఁగల్గిన పొమ్మంటివి. వచ్చితిని. ఆశ్రితరక్షాపరాయణుఁడగు రామచంద్రుని శరణుఁజొచ్చితిని. నాకెందును గొఱఁత లేదు. నేనిప్పటికిని ధర్మబద్ధుఁడను. ధర్మేతరులై స్వకులనాశనమునకు మీరే ముందంజ వేసి యున్నారు. ఇప్పటికైన మించినది లేదు. రాముఁడు నారాయణుఁడని గ్రహించితివేని.

గీ॥ బుద్ధిమంత! నీ విప్పటికైన । బుద్ధిఁ గలిగి
పోయి, నీ తండ్రికింకయు । బోధఁ జేసి
యవనిజాతను రాముల । కప్పగించి
శరణుఁ జొచ్చిన సంధిపొ । సంగఁ గలదు॥

ఇంద్ర—దురాత్మా! తొందరఁబడకుము. ముందు రామానుజునిఁ బొలియించి, పిదప నీమాటలాలించెదను. ఓరీ! నరాధమా! భగ్నరథుండనైతినని సంతసింపకుము. ఇంక నీగతి విచారించుకొమ్ము. నరవానరుల నాగపాశబద్ధుల గావించిన మేఘనాదుఁ డితండని మాత్రము యోచించుకొని మఱి నిలువుము.

లక్ష్మ—ఓరీ! ఆశుదానికంటె నధమవృత్తి నవలంబించిన శూరమన్యుఁడవగు నిన్ను నేనెఱుంగనా? నంటయింటికుంచేలువలెఁ జిక్కిన నీగతి యేమగునో ముందూహించుకొనుము. ముఖాముఖిగఁ బోరాడు పురుషసింహుండవేని, కాలికి బుద్ధిఁ జెప్పకొనక, నన్ను దాకి జయించిన నీవొక శూరుండవే సుమా? (అనుబంధము 23

ఇంద్రి—ఓ యల్పప్రజ్ఞాధురంధరా? నన్నెన్వనిఁగ భావించితివోసుమా! (అనుబంధము 24)

గీ॥ అష్టదిక్పతులను గెల్చి । నట్టివాఁడ
భవుని మెప్పించి వరములఁ । బడసినాఁడఁ
దోకఁ గాల్పించి కోతినిఁ । దోలినాఁడ
జయుఁడ! నీవేక? నాతోడ । సమరమేడ?॥

లక్ష్మ—నిశాచరాధమా? వరబల గర్వాంధకారమున నీవొనరించిన మహాపాతకములకు ఫలము, ప్రళయనిర్ఘాతనిభంబగు మదీయ దివ్యాస్త్రమున నిన్నుఁ దూలించెడి నిలువుము. మాటలతోనేమి? శరము సంధింపుము.

ఇంద్రి—ఏమి నీపొగరుఁబోతుఁదనము. మృత్యువు కలవరియఁబోసికొని నీనెత్తినఁ గూరుచుండ నామాటలేల వినెదవు? ఇంక సంసిద్ధుఁడవు కమ్ము. (బాణము నెక్కువెట్టుచుండును.)

లక్ష్మ—(బాణము సంధించి)

గీ॥ దాశరథుఁడు విష్ణువన । తారుఁడేని
సీతసాధ్వీమహాశక్తియసు । శీలయేని
భార్గవవిరాము నమ్మిన । వాఁడనేని
చెనటి! యీబాణవహ్నిఁ జ । చ్చెదవుగాక॥

ఇంద్రి—హా! హా! (అని నేలఁగూలును)

(తెరపడును.)

---

పంచమదృశ్యము—రణరంగము.

[లక్ష్మణునిఁ దొడలపై నిడికొని రాముఁడు కూర్చుండి యుండును. వానరులు దీనవదనములతో నిలువఁబడి యుందురు.]

రాము—హా! మనుకులాంభోధిరాకాసుధాకరా! హా! జగత్కంటకాసురమారణవిహారా! హా! నిరంతర ధర్మకర్మాచరణ పరంపరా! హా! భయం

కరాహవ భయంకరా! హా! మదాజ్ఞానుచరా! హా! సౌమిత్రికుమారా! హా! సోదరా! సమరవ్యాపార వీరరుద్రావతారప్రభాజ్వలితోద్భయంకరుఁడవయ్యు, దానవాశుగహతిని మూర్ఛమునింకయున్న నిన్నుఁ జూచి ప్రాణంబులెట్లు భరింతును? ఎంతని దుఃఖింతును? నీకన్నఁ దమ్ములవిచ్చి కూడకున్న నెబ్బంగి సహింతును? (అనుబంధము 25)

హా! నేనెంత పాపకర్ముండను? ఎట్టిదుర్ముహూర్తమున జన్మించితినో కాని, నాజన్మమాత్రమ్మయుఁ కేగాక, సమస్తలోకములకును విషాదకరముగనె పరిణమించుచున్నది కదా?

సీ॥ నేమహాటవికేగి । రామ! రామాయంచు
సడలుచు స్వర్గంబు । కటికెఁదండ్రి
కన్నతల్లి దుఃఖమున శోషఁ । గాంతుంచు దివికేగ
నెంచిన మోహముగా । నుండెఁదల్లి
నారాకఁజూచుచు । నావలెనే జటా
వల్కలధారియై । ధరకుఁ గుంగె
మాంకిదవమానుని । మనుచుఁడనొట, సా
ధ్వీశిరోమణి పరా । ధీనయయ్యె

గీ॥ ఊర్మిళాదేవియందునఁ । గూర్మిలేక
రాజ్యభోగాదులందు ని । రాగుఁడయ్యు
నింతకాలము నావెంట । నిమిషములోర్వి
ధాత్రిమూర్ఛిల్లెనేఁడు సౌ । మిత్రిఁ గూడ॥

ఈవిధముగ నెల్లరకు వ్యసనకరుండనై జీవించుకంటె, మత్ప్రాణత్యాగమే మేలని తోచుచున్నది. హా! తమ్ముఁడా! సౌమిత్రీ! నీయట్టి నిర్మలాంతరంగుని, నీయట్టి భ్రాతృచరణకమలసేవాపరతంత్రుని, నీయట్టిదివ్యమంగళాకారుని, నీయట్టి రణవిద్యాప్రవీణుని, నీపాలిటఁ గాలుండనై, నిన్ను దండకాటవికిఁ గొని తెచ్చి, నిద్రాహారములకు దూరమొనరించి, నీజీవితమంతయు నాసేవకావృత్తియందు నియోగించి, యలయించిన దానికిందోడు, దశకంఠుని క్రూరనారాచమున మూర్ఛిల్లి, కరకురానేలఁబండి, మేనెల్ల ధూళిగప్పి, నోటనురుగులు గ్రక్కుచుఁ బడియున్న నిన్నుఁ జూచి, విలపించుమని, నా

నదుటు నలువ మూఁడు పంక్తులుఁ దీర్చి వ్రాసియుండెనో? హా! సోదరా! మూర్ఛనుండిలేచి నీవు నాదండ నలరుభాగ్య మీయభాగ్యునకున్నదో లేదో కదా? (తూర్పువైపుఁ దిలకించి) అయ్యో! సూర్యోదయమునకింక ఘడియ కాలమున్నది. అరుణోదయమునకుఁ బూర్వమే యాంజనేయుఁడు ద్రోణాద్రిఁగొనివచ్చి నిన్ను సజీవునిఁ జేయునా? మరల రామలక్ష్మణ బాణాగ్నులు విజృంభించునా? లంకానగరము బూదిపాలగునా? సీతారామలక్ష్మణు లయోధ్యకేగుదురా? విధినిర్ణయమెట్లున్నదో కదా? హా! అనుజా! సుమిత్రాసుతా!
(లక్ష్మణుని పైఁబడును.)

సుగ్రీ—(తనలో) అకటా! తెల్లవారుటకు కొంచెము గూడ లేనట్లున్నది. ద్రోణాద్రికరిగిన వాయుపుత్రుని జాడయే కానరాకున్నది. రాముని దుఃఖము మితిమీరిపోవుచున్నది. ఈవిపత్సాగరము నెట్టుల నీదువారమో కదా?

విభీ—సుగ్రీవా! రామచంద్రుఁడుగూడ స్మృతిఁదప్పి పడియున్నవాఁడు. మారుతి జాడలేదు. సూర్యోదయకాల మాసన్నమగుచున్నది. మన యాశలెల్ల తెల్లవారునో కదా?

సుగ్రీ—విభీషణా! ఏమని చెప్పుదును? ఏమి చేయుదును?

రాము—(లేచి) ఓసుగ్రీవాదులారా! ఆంజనేయుఁడింకను రాలేదుగా?

సుగ్రీ—ప్రభూ! ఈపాటికి వచ్చుచుండును.

రాము—(దిశలఁబరికించి) హా! హా! ఇంకేమున్నది. పూర్వరేఖలుఁ దెల్లవారుచున్నవి. ఇంకెక్కడిద్రోణాద్రి? ఇంకెక్కడి సోదరుఁడు. ఇంక మీరు మూఁడు దారిఁ జూచుకొనుఁడు. అల్లదే! దిశలంతకంతకుఁ దెల్లవారుచున్నవి. కులకర్తయయ్యు, భాస్కరుఁడే నాకపకారము చేయనున్నాఁడు. కావున, వీనిప్రల్లదమడంచి, రామనిర్వాణమునకు స్వస్తి చెప్పెదఁ గాక. (కోపముతో)ఓయీ! చండకరా! ఏమినీకండ కావరము?

శా. సౌమిత్రుండిలఁగూల, మారుతిజయా । సంరంభుఁడైయద్రి నీ
సీమం జేర్పకమున్న, తమ్ముఁడుపున । ర్జీవంబులందాల్చి శ్రీ
రాముంగూడకమున్న, నీవిటుల రా । రా! క్రూరతన్ దోచెదే!
భీమంబైన శరాగ్నికీలలను భ । స్మీభూతమున్ జేతునూ! ॥
(బాణము సంధింపఁబోవును.)

సుగ్రీ—రామచంద్రా! శాంతింపుము. శాంతింపుము. అది ద్రోణాద్రి వెలుంగుగాని, సూర్యోదయముగాదు. అల్లదే వాయుసుతుఁడద్రిరాజముఁ గొనివచ్చుచున్నాఁడు.

ఆంజ—(ద్రోణాద్రితోఁ బ్రవేశించి) రామచంద్రా! ద్రోణాద్రిఁ గొనివచ్చిన వాయునందనుఁడిదే నమస్కరించుచున్నాఁడు.

రాము—(కౌఁగలించుకొని) నాయనా! మారుతీ! భక్తుఁడవన నీవేకదోయీ!

సుగ్రీ—సుషేణా! ఆలస్యమేల? ఈ పర్వతంబునఁగల విశల్యకరణిచే సౌమిత్రిని సజీవుని జేసి మా కానంద మొసంగుము.

విభీ—సుషేణా! త్వరపడుము.

సుషే—అట్లే యొనర్చెదను. (విశల్యకరణి లక్ష్మణుని నాసికముల నుంచును.)

లక్ష్మ—(మూర్ఛనుండి లేచును.)

రాము—(కౌఁగిలించుకొని) హా! తమ్ముఁడా! లక్ష్మణా! ధన్యుఁడనయితిఁగదా! మారుతీ! నీయుపకారములు మరువఁదగనవి కావుసుమా?

లక్ష్మ—అన్నా! ఆదశకంఠుఁడెందున్నవాఁడు?

రాము—లక్ష్మణా! ఆదురాత్ముఁడు శక్తిబాణమున నిన్ను మూర్ఛిలఁ జేసి గృహాభిముఖుఁడయ్యెను. నేఁడే మదీయబాణాస్త్రప్రయోగంబున వాని వదన దశకమును దునుమాడి విజయధ్వజము నెత్తించెదఁగాక. సుగ్రీవా! విషాదసాగర నిమగ్నులగు వానరులనెల్ల మేల్కొలిపి, రణాభిముఖులఁ గావించి రణభేరి మ్రోగింపఁజేయుము.

సుగ్రీ—చిత్తము.

రాము—హనుమా! ఆ హవిషీమా? (అనుబంధము 23)

(యవనిక జారును.)

---

### *పద్మమ దృశ్యము—పాతాళహోమవాటిక.

[రావణుఁడు తపోనిష్ఠయందుండఁగ, నంగదుఁడు మండోదరి శిరోజములు పట్టుకొని ప్రవేశము.]

మండో—హా! నాథా! అనాథనాథా! దైత్యనాథా! రక్షింపుము. రక్షింపుము.

అంగ—అరే! దురాత్మా? నిశాచరాధమా?

శా॥ మాయారూపుఁడవై హరించితివి, రా । మస్వామి యర్ధాంగి నాఁ
డాయుగ్రాటవి నొంటినుండఁగ, రణ । వ్యాపార శీలుండవై
న్యాయాన్యాయములేక; నీయెదుట లం । కారాజ్యలక్ష్మిన్ భవ
ద్జాయన్, నేనిదె గొప్పువట్టితిని, నీ । చస్వాంతుఁడా! చూడరా!॥

ఓరీ! పాతాళహోమముఁ బాడుగాను. ప్రళయకృతాంత సదృశులగు నరవానరుల ధాటి కోర్వలేక, పందవై పాఱివచ్చి, పాతాళహోమముఁ జేయుచుంటివి గాని,

గీ॥ పట్టపుందేవి, రోదన । ధ్వనులు సేయ
పౌరుషోద్రిక్తవై, ధను । ర్బాణివగుచు
పగరనోడించి, సతిచె । ఱఁబాపవేల?
మనుజభోజన! లజ్జాభి । మానశూన్య?॥

మండో—(దుఃఖముతో) హా! ప్రాణపతీ! నామొఱాలింపవేల? కట్టెదుటఁ బట్టపుందేవి నొక దురాత్ముఁడు కొప్పువట్టి యీడ్చుచుండ నీకేల కనికరము లేదు. పెండ్లము పరవారిచేఁ గటకటఁ బడుచుండ నీకేల జాలిలేదు? జగదేకవీరుండవగు నీయిల్లాలు పరస్థలమున పరునిచేఁజిక్కి యెలుఁగెత్తి యేడ్చుచుండ రక్షణదక్షమగు నీదక్షిణహస్త మేల విజృంభింపదు? అయ్యో! చెవులు వినరావ? కనులుఁ గానరావ? నీహృదయము వజ్రసన్నిభమా? దివ్యాంతఃపురవాసినిని, లంకానగర పట్టమహిషిని, సురాసురాదులకేనిఁ దేరిచూడరాని శుద్ధాంతనివాసిని- సకల దిక్చక్ర వీరవిజయావతార ప్రళయకృతాంత సదృశాసురేశ్వర రావణసార్వభౌమదేవేరిని, తృణప్రాయుఁడగు వానరుఁడు, వానరాధముఁడు, కేశములఁ బట్టియీడ్చుచుండ, పరిభవించుచుండ, బాధించుచుండ, ముప్పుతిప్పలు పెట్టుచుండ, వెడలిరావేల? కోతిని జంపవేల? కేశబంధము విడిపింపవేల? అక్కటా! నాథా! కరుణాసనాథ! నాశిరమెంత వేదన నొందుచున్నది? నీప్రాణతుల్యేందిర నిట్లనాథఁ జేసెదవని కలనైనఁ దలంపనుగదా? ఇదేమియన్యాయము? ఇదేమిపాపము? ఇదేటి పౌరుషము, ఇదేటి మానవ్రతము? తుట్టతుద కెంతటి నికృష్టజీవితను జేసితివి, నీవిప్పుడు సమర్థుఁడవై, నన్ననాథను జేయనేల? రాముఁడాదినారాయణుఁడని, అవతార పురుషుఁడని, ఆపదోద్ధారుఁడని, అసురకుల సంహారుఁడని. నెత్తిన నోరుపె

ట్టుకొని మొత్తుకొనినను, నాహితవాలింపక, నరవానరులతో ఢీకొంటివి! భ్రాతృ, పుత్ర, మిత్రసబాంధవములఁ గోలుపోయితివి. పరాజయమునఁ బాతాళముఁ జొచ్చితివి. నన్నీ యధమాధముని పాలొనర్చి యలయింపు చుంటివి. నాథా! నాథా! నేను నీయర్థాంగిని, మండోదరిని. కన్నులు విచ్చి చూడుము. ఈ భయంకర దృశ్యమునకు గారణుఁడగువానరుని వధింపుము నన్ను రక్షింపుము. నాథా! రక్షింపుము,

రావ—(చూచి మహాకోపముతో లేచి) అరే! పాపాత్మా? ఇదే చచ్చితివి. (అంగదుని గుద్ది మండోదరిని విడిపించును.)

అంగ—అరే! రావణా! ప్రతిఫలము. (వానిని గుద్దును.)

(హనుమత్సుగ్రీవులు ప్రవేశము.)

రావ—(క్రిందఁబడి లేచి తనలో) హా! తుదకు నా కంతగతి పట్టినది. నేనిప్పుడు వెనుకంజ వేయరాదు. (ప్రకాశముగ) అరే! వానరులారా! రావణచక్రవర్తి రణమునకు సిద్ధమైయున్నాఁడు. నేటితో మీ కాయువు చెల్లెనని తలంచుఁడు.

హను—ప్లవంగేశ్వరా! మన కార్యము నెఱవేఱినది. ఇప్పుడు కర్తవ్యమేమి?

సుగ్రీ—మనము త్వరితముగ రామానుజుల కీవృత్తాంతముఁ దెలియఁబఱచుటే కర్తవ్యము. అంగదా! పోవుదమురమ్ము. (హనుమత్సుగ్రీవాంగదులు నిష్క్రమింతురు.)

మండో—ప్రాణేశ్వరా? ఇంకనైన రణాభిలాష విడిచి, సీతాదేవిని రామచంద్రున కర్పించి, సంధిఁ గావించుకొనుము. నామాటవినుము. నన్ను మన్నింపుము. యుద్ధమనవసరము. సంధి శ్రేయస్కరము.

రావ—(కోపముతో) ఛీ! ఛీ! ఎట్టిదినోక్తులాడుచుంటివి? అవలఁబొమ్ము. (ఆమెను దోసివేసి) నేనిదే నరవానరకటకములను మదీయ బాణాగ్నిలో బూదిఁ జేసి రాకున్న నేను రావణుండనా? (నిష్క్రమించును.)

(తెరపడును.)

——♦——

## సప్తమదృశ్యము—సమరప్రదేశము.

[రావణుండు భగ్నమకుటుండై రథముచెంతఁ బడియుండును]

రావ.—హా! చిట్టచివర కట్టి జగజెట్టి యెంతట యసమర్థుఁడయ్యెను? ఇంద్రాదిదేవతలజయించి, స్వర్గాదిలోకము లాక్రమించి, కుబేరపుష్పకము సంగ్రహించి, పదునాలుగులోకములు నేకచ్ఛత్రముగఁ బాలించి, నాకంటె నసాధ్యుఁడే యీలోకంబుల లేఁడనుకొంటినిగాని, యిట్టి ప్రచండపరాక్రమ విక్రమాటోపముఁగల నరవానర వీరకేసరులఁ జూచనైతినిగదా? నిర్జితపరాక్రమశీలుండగు కుంభకర్ణుండును, దేవాంతకుఁడగు మేఘనాదుండును సురారాతి వీరవిజయ రక్షోవీరవాహినీ నాయకులును, వైరి వీరబాణాగ్నిలో బూదిబుంగలై స్వర్గమలంకరించినారుకదా? సర్వనాశన మొనర్చుకొని నేనిప్పటికిని లెక్కసేయక శాత్రవుల ధిక్కరించి పోరాడి వేసారిపోయితిని. అదేమి పాపమో కాని, నరవానరులతోఁ బోరునప్పుడు, మనసుచెదరియో ధైర్యముసడలియో, దేహమువడఁకియో, మదీయశరజాలములందొకటియైనఁ బగతురఁ బీడించినట్లు కనుపట్టదు. రామబాణంబులు మాత్రము మదీయబాహువులను భగ్నంబుఁ జేసియో, కవచాదులుఁ జీల్చియో, మకుటంబుల బడఁగూల్చియో, శరీరము నొప్పించియో, నానావిధములఁ గష్టపెట్టుచునేయున్నవి. ఎంతని యుద్ధముసేయుదును? సుంతయిన జయము లభింపదయ్యె. (తలపంకించి) హా! విభీషణా? నీనీతిబోధామృతరసంబు నుగ్రోలియున్న నాకీదుర్గతి గలిగియుండదుకదా? మీదుమిక్కిలి నిన్నుఁ బరిభవించి, కాలఁదన్ని వెడలనడచినందుల కిదియే ఫలితము గాఁబోలు? అయ్యో! ఈసర్వనాశమునకు నీకయేకదా మూలకారణము. ఇప్పటికైన భూమిజను నామహాత్మునకొసంగిన ముప్పుఁ దప్పునుగదా? (యోచించి గర్వముతో) ఛీ! ఛీ! సర్వారిష్టమైనదిగాక, కంఠగతప్రాణుండనై, కేలవజ్రాయుధ మున్నంతవఱకు నరుల శరణుఁ గోరుదునే?

శా॥ లంకారాజ్యముఁ గాల్చినట్టి ఖలు నా । లంబందుఁ దూలించెదన్
లంకారాధ్యుని నింద్రజిద్ఘ్నుని దు । ర్వారోగ్ర కోదండునిన్
జంకుం గొంకునులేకఁ జంపిననరున్ । సౌమిత్రినింగూల్చి, ని
శ్శంకన్ రాముని నోటఁబుచ్చి జయమున్ । సాధింతురుద్రుండనై॥

[శ్రీరామలక్ష్మణ హనుమత్సుగ్రీవ విభీషణులు ప్రవేశము]

లక్ష్మ—

శా॥ అన్నా! రావణుఁ డుడ్గినాఁడని, రణ । వ్యాపారమున్ మాన్పి నా
వన్నా! కన్గొనుమల్లదే రథసమీ । పంబందు నుత్సాహియై
యున్నాఁ డాలము సేయ, వెండియు నెదో । యుక్తిన్ బ్రయోగింపుమన్;
భిన్నప్రాణునిఁ జేయుమా సురలు ని । ర్భీతాత్ములై యుండఁగన్

విభీ—రామచంద్రా! రావణసంహారముఁ గన్నులారఁ జూచి యానందింపవలయు నని నిఖిలదేవగణంబులు వియన్మార్గమునఁ దోతెంచుచున్నారు. ఇంకఁ గాలహరణమేల? దురాత్ముని వధావిధానమునకుఁ గడంగుఁడు.

రాము—ఆహా! రావణ నిర్యాణోత్సవమే జగదానందమని, దేవతలెల్లరు విమానారూఢులై చూచుచున్నారుకదా! వీఁడు జగత్కంటకుఁ డగుటచేతనే దిక్పాలురెల్లరుఁ గూడ పరుదెంచి యున్నారు. పాపభూయిష్ఠుఁ డగు దశకంఠ విలుంఠనమే నాకిప్పుడు పరమధర్మము. (రావణునితో) ఓరోరి! పరాంగనాపహరణపారీణా! మనుజభోజనా? రావణా! రణంబునకేతెంచి, భయంబునఁ బరికెపించు పందవైతివేమిరా?

చ॥ ధనదునిఁ గెల్చి; దిక్పతుల । ధైర్యము దూల్చి; శచీంద్రునోర్చి; స
న్మునుల నదల్చి; కందుకము । పోలిక హేమనగంబు నూసి, యా
వనజభవుం డొసంగినన । వారిత మేటివరప్రదాన స
ద్ఘనుఁడవు నై, రణావని మొ । గంబుఁ ద్రిప్పెదవేల? దీనుఁడా?॥

లక్ష్మ—ఓరీ? రోషలజ్జాపరాక్రమలవదుర్విదగ్ధా!

గీ॥ ఓరి? నీదురహంకార । ముడిఁగెనేని
యిప్పటికినైన సీతమ్మ । నిచ్చివేసి
శరణు గోరుము మా రామ । చంద్రు నెలమి
నాఁటులఁగాకున్న నిలువు మీ । యాహవమున॥

రావ—రే? నరాధములారా! మహావీరులెందఱో మదీయ ప్రతాపాగ్నికి శలభాయమానులై వీరస్వర్గ మలంకరించిరి. మీరన నెంత?

గీ॥ గరుడ సమ్ముఖు ఢీకొనఁ । దలఁచినట్లు
బెబ్బులిం దాఁక వచ్చిన । పిల్లియట్లు

మదపుటేనుఁగు నాసించు । మనుజునట్లు
కాలమా? మీకు మూడెను । కదలిరండు॥

రాము—రాక్షసాధమా! నీప్రతాప మెవ్వ రెఱుఁగ రనుకొంటివి?

సీ॥ కార్తవీర్యుని భుజా । స్కంధమ్ములం జిక్కి-
యయ్యయో! యంచు న । ల్లాడినపుడు
జనకపురిని యో । త్సవ మొంద హరువిల్లుఁ
మైవేసికొని నేల । వాల్చినపుడు
బలశాలియగు వాలి । వాలాగ్రమునను బం
ధించి, నిన్ జలధుల । ముంచునపుడు
అస్మదీయాగ్రజా । బాణానలజ్వాల కో-
ర్వఁగలేక, రణమునఁ । బారినపుడు
గీ॥ ఈప్రతాప మీశౌర్య । మీబలంబు
నీప్రగల్భము నీతెల్వి । యెందుఁబోయె?
నేను నిన్ జంపి ధరణిజ । నేలకొన్న
రాముఁడను నేనుఁగానరా । రావణుండ॥

రావ—ఓహూ! నీవు నన్నధిక్షేపింప నర్హుండవే. ఏమంటివేని? నీవు.

స్త్రీహత్య, కారవా । దికమంచుఁగొంకక
దానిఁగంజంపుట । ధర్మమగునె?
భయపడి, రాజ్యంబు । భరతునకర్పించి
వనులఁ గాపురముంటఁ । బౌరుషంబె.
జనసత్త్వములు లేక । శత్రువృద్ధుఁడైనట్టి
మారీచుఁజంపుట । మగతనంబె?
చెట్టుచాటున డాఁగి । గుట్టువెల్వడనీక
వాలినింగూల్చుట । బాహుబలమొ?
గీ॥ నీప్రతాపము, నీకీర్తి । నీబలంబు
నీదుధర్మము, నీరాజ । నీతిగుణము
లోకమే చాటుచుండఁగ । లోకులనిటు
నిందఁజేసెదవేల? ను । క్షితిపరుఁడ॥

భీరుఁడవై పలుపోక లేలఁబోయెదవు? ఈదశాస్యుని బలశౌర్య రణకౌశలాదులింకఁ జవి చూడఁగలవు. యుద్ధసన్నద్ధుఁడవు గమ్ము. (సమరోత్సాహుఁడగును.)

రాము—దురాత్మా! ఇదే కడ తేరితివి. చూడుము. (బాణము వేయును.)

రావ—(దానిని ఖండించి) నీవే త్రేటమైనదో చూచితివా? ఈశరముతో నీవు కడ తేరితివి. నిలువుము. (బాణముఁ బ్రయోగించును.)

రాము—(ఆబాణమును తప్పించుకొని) ఓరీ! ఈదెబ్బతోఁ జచ్చితివి.

రావ—(తప్పించుకొని) నీయల్పాశుగములు నన్నేమి సేయఁగలవు? ఇదే మదీయశర జాలంబులఁ బ్రయోగింపుచున్నాను. నీశక్తినింకఁ జూచుకొనుము.

(అనుబంధము 27)

(ఒండొరులు బాణములు ప్రయోగించుకొందురు.)

రాము—(తనలో) ఔరా! ఏమీచిత్రము? మదీయశరాఘాతమున మస్తకములు తెగియు వెండియు మొలచుచున్నవి. పోరు ఘోరమగుచున్నది. వీఁడిఁకఁ జచ్చు మార్గమెట్లోగదా (బాణము వేయును.)

విభీ—(స్వగతము) నేనీసమయమున రావణవధోపాయము రామున కెఱింగింపకున్న ద్రోహి నగుదును. (ప్రకాశముగ) రామచంద్రా! వీనిమరణమున కొకయు పాయమున్నది. బ్రహ్మవర ప్రభావమున నమృతము వీని నాభికమలమునఁ జేరుకొన్నది. కావున, పావకాస్త్ర ప్రయోగమున హృదయకలశముఁ బగులఁగొట్టిన వీఁడు మడియఁగలఁడు.

(అనుబంధము. 28)

రాము—మంచిది. అరే! రావణా! ఇంకెందుఁబోయెదవు రా బడబానలసంకాశమగు నీపావకాస్త్రమున విగతజీవుఁడవయ్యెదవు కాక.

(పావకాస్త్రముఁ బ్రయోగింప రావణుఁడు నేలఁగూలును.)

(యవనిక జారును.)

---

అష్టమదృశ్యము—త్రికూటాచలము.

[రామానుజులు కపులతోఁ గూర్చుండి యుందురు.]

లక్ష్మ—(స్వగతము) 'సీతామహాదేవిని గొని రాసరిగిన రావణాసురుఁ డింకను రాకున్నవాఁడు. సంపూర్ణవిజయుఁడగు రామచంద్రుఁ డీసంతోషసమయమున నేలకో ఖిన్నుఁడై భూమిని నిందించుచున్నాఁడు. వదనముఁ గళఁదప్పి యున్నది. వీని యాంతరంగిక భావములు సముద్రతరంగములవలెఁ బొరలు

చున్నట్లు తోచుచున్నది. ఈమహాత్మునిఁ బలుకరించి కారణ మడుగుటకే భయమగుచున్నది. కారణమేమైయుండునో కదా? (చప్పుడాలించి వెనుదిరిగి చూచి)అల్లదే మాసీతమ్మతల్లిని విభీషణుఁడు తోడ్కొని వచ్చుచున్నాఁడు.

విభీ—(సీతతోఁ బ్రవేశించి) శ్రీరామచంద్రా! భవదాజ్ఞానుసారము సీతామహాదేవి యిదె వచ్చుచున్నది.

సీత—(ప్రవేశించి సంతోషాతిశయముతో) హా! ప్రాణనాథా! ఎంత కాలమునకు మిమ్ము దర్శింపఁ గలిగితిని. (కౌఁగిలించుకొనఁ బోవును)

రాము—(లేచి దూరముగఁ బోయి) సీతా! నన్నంటకుము. దూరముండుము.

సీత—హా! ప్రాణేశ్వరా! ఇదేమి నిగ్రహాకారము!

గీ॥ కోపమా? లేక నావల్ల । పాపమా? దు । రంతసంతాపమా? యుపేక్షింపుదోస
మా? పురాకృత పుణ్యమా? । మానవతిని సీతనిట్టుల దూరాడ । కిది యేల! ॥

రాము—కాంతా! చెప్పెదవినుము. రావణాపహృతవగు నిన్ను, ప్రాణసమోత నేనుఁ జేపట్టి, లోకనిందకుఁ బాత్రుండనైతి, నిష్కళంకమగు రఘుకులాన్వయమునకుఁ గళంకముఁ దేఁజాలను. ఇక్ష్వాకువంశజులుఁ బ్రాణహానికైన నోర్తురుగాని, మానహాని నోర్వఁజాలరు. కావున, నీవింక నెచ్చటికైనఁ బొమ్ము.

సీత—హా! పరమేశ్వరా! (మూర్ఛిల్లి మరల లేచి) అక్కటా! దైవమా! నాయందింత కక్ష గట్టి, నాజీవితమిట్లు దుఃఖభాజనము సేయుచుంటివా? నేను, కలుషాసురాపహృత నైతినని, దారాపరిగ్రహణ విముఖత్వమును మున్నాథుని కలిగించి నిర్దయత్వము వహింపఁ జేసితివా? అస్మత్ప్రాణనాథుని సుచరిత్రమునకేమిగఁ గళంక మాపాదించితినేని, మచ్ఛిరం బీక్షణమున సహస్రశకలంబులు గాకుండునా? హా! ముక్కోటిదేవతలారా! భూమ్యాకాశాది పంచభూతములారా! దేవాదిదేవులారా! సతీసత్య పరీక్ష మీకైనఁ గోచరము గాదా? మీరైన సాక్ష్యమిచ్చి, శ్రీరామచంద్రునితో విన్నవింపరాదా! మీచేతఁ గాకున్నచో, నీపాపాత్మురాలి నింకజీవముతో నుంచనేల? ప్రపంచమునకే భారమగు నాజీవితమేల నశింపఁజేయరు. పతివలన బహిష్కరింపఁబడిన పాపి నేల భస్మీపటలముఁ జేయరు! హా! ఎంతభయానకము? ఎంతటియాశ్చర్యము? మనోవాక్కాయకర్మంబుల మన్మనంబుఁ శ్రీరామనామామృతపానంబున నొగలు మఱచియుండుట, నాఁడా యాంజనేయుని

ముఖమున వినియున్న మన్నాథుఁడు, రఘురాముఁడు, జానకీ చిత్తచో
రుఁడు, రఘుకులాభరణుఁడు, దశరథరాముఁడే నే నపవిత్రనని పలుక
వినియుంటివా? అవును. చెవులారవినియు నేనింక జీవింపనేల? ఇక్ష్వాకు కులాం
బునకుఁ గళంకినగు నేను నశించుటే పరమోత్కృష్టము. సౌఖ్యమా! స్థలాం
తరమునకుఁ బొమ్ము. అనురాగమా! నీవు నానుండి వెడలిపొమ్ము. దుఃఖ
మా! తొలఁగిచనుము. మోహమా! నన్నుఁబాసి సాకేతరాముని వరిం
పుము. ఆశాపిశాచమా అంతర్ధానమగుము. జనకా! జనకరాజేంద్రా!
సీతారాజపుత్రిక నింక మఱచిపొమ్ము. తల్లీ! భూదేవి! నీకడుపునఁ జెడఁ
బుట్టినసీతకొఱ కింక విచారింపకుము. (రామునిఁజూచి) నాథా! పరమకరు
ణాసనాథా! మీరు మీతండ్రియాజ్ఞఁ బాలించితిరి. నేను మీయాజ్ఞ శిర
సావహించెదను. ఇంక నాకీలోకమునఁ దావులేదు. అగ్నిభట్టారకునకు నా
దేహమర్పించెదను. కరుణించి, యగ్నిప్రవేశమునకు నాకనుజ్ఞ నొసంగుఁడు.
మఱఁది! లక్ష్మణా! చితినిఁ బేర్పుము. లెమ్ము. ప్రయత్నింపుము.

లక్ష్మ—(స్వగతము) హా! పాపిష్ఠదైవమా? ఎంతకుఁ జేసితివి? కలుషాసురాంతర
మునఁగూడ నీసాధ్వి నిట్టిపట్టు నిల్పించితివా? ఓబ్రహ్మాదిదేవతలారా!
మీరు ఖున సత్యంబుఁ దేటఁబఱచి యీమహిళాలలామను శ్రీరామానుగ్ర
హపాత్రఁ జేయలేరా! అయ్యో! రాముఁడే వేఱైన మీకుఁ గరుణలేదా?

సీత—లక్ష్మణా! నావిషయమై చింతింపవలదు. ముందు చితిఁ బేర్పుము.

లక్ష్మ—అగ్రజా! ఆజ్ఞ.

రాము—ఆమెకోరిక నెఱవేర్పుము.

లక్ష్మ—చిత్తము. (చితినిఁ బేర్చును. మంటలు ప్రజ్వరిల్లును)

సీత—(మంటలుజూచి) నాథా! కరుణాసనాథా!

గీ॥ చిత్తమేప్రొద్దు మీసేవఁ । దలఁగునేని
జగతియందున నేనొక । సాధ్వనేని
వహ్నిఁజొచ్చియు మీప్రాపుఁ । బడయుదానఁ
బ్రాణములివె గొనునాథ! మ । త్ప్రాణనాథ!॥

(అగ్నిహోత్రుని దరిజేరి) ఓ అగ్నిదేవా!

గీ॥ ఇలను నేనింక దోషభూ । యిష్ఠనేని
సాధ్విగానేని వేగ భ । స్మంబొనర్చు

భూమిభారంబు దీర్చుమో । పుణ్యపురుష !
సర్వమైన పదార్థ మీ । జగతినింపి॥

(అగ్నిఁబ్రవేశింప మంటలు జల్లారి, యందుండి వైశ్వానరుఁడు సీతతోఁబ్రత్యక్షమై)

హే ! పరంధామా ! రఘుకుల సార్వభౌమా ! జగదభిరామా ! శ్రీరామా ! పతివ్రతాశిరోమణియగు సీతమ్మతల్లియం దెట్టిదోషములులేవు. ఇంకనీ జనకజను బరిగ్రహించి, సాకేతపురంబున కరిగి పట్టాభిషిక్తుఁడవై, యశోవిశాలుఁడవై, సర్వమహీమండలముఁ బాలింపుచు నానందవారాశినోలలాడుము. (అగ్నిహోత్రుఁ డదృశ్యుఁడగును. సీత నిలువఁబడి యుండును)

రాము—(సంతోషముతో) హా ! ప్రాణేశ్వరీ ! జానకీ! (సీతారాములు కౌఁగిలించుకొనెదరు) జానకీ! దుఃఖంపకుము. నీదృఢాలింగన మహోత్సవమే పట్టాభిషేకము నున్నది. విభీషణా ! నిన్నిలంకారాజ్యమున కభిషిక్తునిఁ జేసితినిగదా ? దైవానుగ్రహమున శుభోదయము గలిగెనది. మావనవాసము గూడ సంపూర్తియైనది! గడువుదాటిన భరతుఁ డగ్నిఁబ్రవేశింపఁగలఁడు. కావున, మేము పురోన్ముఖుల మగుచున్నాము. నీవును రమ్ము.

విభీ—చిత్తము. (యవనిక జారును)

శ్రీరామచంద్ర పట్టాభిషేకమండపము.

(ఋషులు, వందిమాగధులు, మంత్రులు, సామంతులు మొదలగువారు కొలువుదీరియుండ, శ్రీసీతారామలక్ష్మణ భరత శత్రుఘ్నులు, సుగ్రీవ హనమద్విభీషణాదులుఁ బ్రవేశము.)

రాము—(ఆంజనేయునిఁ గౌఁగిలించుకొని) ఆంజనేయా ! నీమహోపకారము వర్ణనాతీతముఁగదా ?

సీ॥ సాధించి, జనకాత్మ । జనుఁగాంచి, తచ్ఛుభ
వృత్తాంతమును విని । పించితయ్య !
నూరుయోజనముల । వారిధి దాటంగ
సేతువు నిర్మింపఁ । జేసితయ్య !
తెల్లవారకమున్నె । తెచ్చి, సంజీవిని
సౌమిత్రిప్రాణముల్ । సాకితయ్య !

కనుదుర్భరవియోగ । జలధిమున్గడచినాఁడ
సీతనుఁగూర్చి ర । క్షించితయ్య!

గీ॥ గిరిజవైరుల వ్యూహముల్ । దెగించితయ్య?
శాత్రవావళికములబూది । సలిపితయ్య!
కోరి శ్రీరామ విజయము । గూర్చితయ్య!
భక్తిఁ జననీవె చెల్లుఁగా । పవనతనయ!॥

వశి—శ్రీరామచంద్రా? పట్టాభిషేకమహోత్సవము నెఱపుదము. సింహాసన మలంకరింపుము.

రాము—చిత్తము. (సింహాసనమునఁ గూర్చుండును.)

వశి—(కిరీటముఁ జేతఁదీసికొని)

గీ॥ రామ! రాజ్యాదిభోగాఢ్యు । రాముఁడవయి
యశఃకలితానందకీర్తిఁ జం । ద్రార్కముగను
గలిగి, సత్పుత్త్రపౌత్త్రుల । నెలమిఁగాంచి
రాజ్యమేలుము, దశరథ । రాజతనయ!॥

(కిరీటమును నెత్తినఁ బెట్టి స్వస్తిఁ జెప్పును)

మంగళము.



కనివిని యెపుడీ లోకంబుననా - హరిణమిటుల నద్భుతంబు గాలుపన్ శర్వరీ
తగిలిని మీకరిగెపట్టుడీ - కృపానిలయ చలమింకేల:॥ మ॥

14 రాముడు—కాఫీ, తితాల్.

కడయక నిపుడేగువాడ॥ త॥ ఓసతి మత్ప్రాణసతీ సుగుణవతీ॥ క॥
పలువిధములు పనుగో-రవంయున కనుగొను మరగడియన్ హరిణమునే
గాని చనుదెంతును - యెపుడీకకోరిక గోరక గోరితి విదేహానా ప్రియమొన
గెదన్ - వేసజూచుమా॥ త॥

15 లక్ష్మణుడు—హిం॥ తో॥ చతురశ్ర.

ఆమృగముదరి కరుగకు మదగ్రజ॥ నీవా॥
యెన్నడిట్టి హేమ మృగము నరయము క-ల్పితము జేసె ధృవంబిది దనుజులు॥ నా॥
మోసమయ్యెడిని పోవలదో భాస్కరకులేశా యంపినదావైన - తార్యధములె
ప్పనపు దిరిగెద రరుగకు॥ జా॥

16 రాముడు—శంకరాభరణము, చతురశ్ర.

తెలిపెదను వినుము కనుము యనుజా॥ తె॥
దాని నపహరించిన దైత్యులు గెలిపెద॥ వె॥
హరిణమునిదె కనుకనిదెత్తును - సతీమణీ మనములరా॥ తె॥
రిపుంబు గలుగిన్ జగంబెట్లున్నైన - భయంకరాకృతి సహింపనా సహింతునా-
వారి - లాగుంపనా॥ తె॥

17 సీత—సోని—చతురశ్ర.

హా హృదయేశ్వరా - సన్ బాసితివా॥ హా॥
అడవి నొకంతన్నై యాపద నొందితివా? యరుగుము మఱిగి
నాపతికే - దోగలిగె కష్టముగా॥ హా॥

18 లక్ష్మణుడు—కాఫీ, చతురశ్ర.

మహిత దేవదేవులారా॥ మ॥ కృపాపూర్ణులగు మహాత్ములారా ఓదయాళు
లారా॥ మ॥
భయద మహాటవి నొంటిజేసి చనుచుంటిగాన బ్రోవుడీ రె॥ మ॥
అనాధరక్షాదక్షులైన మీరనాధ సతికృపనగయుచుండుడీ - లోకమేలుదు
మగా - సర్వమును - మీకెగోచరముగా - జానకిని మీస్వాధీనము జేసి -
నేనరుగుచుంటి గరుణ నెటు లరసెదరో॥ మ॥

19 సీత—మధ్యమావతి, చతురశ్ర.

పలుగాకిపనులుసేయకుమ - పాపంబని మదినెంచుమా తులువ॥ ప॥
సచ్చరిత్రితా సాధ్వులతో నీ - సరణినొనర్పన్ జనందగదు॥ ప॥

సాధ్వులనిట్టుజేసిన నీల సహస్రములగు దుర్మదాంధమా నడిజనుమా॥ప॥
రామచంద్రుడే తెంచిన నినుమాయించును కాల్కొలదిగి పలుగిడుమ॥ ప

20 రాముడు—ఆనందభైరవి, చతురశ్రి.

సురలారా! మునులారా! సతి, సాధుసుశీలను సీతను గనుగొనినారా॥ సు॥
అడవుల వనముల గిరిగుహాలందు - అవనిజజాడం గనిన జెపుడీ॥ సు॥
తరులారా! గిరులారా! వైరాగ్యభావయోగపుబోధచేత మనజాలక - నా-
ప్రియసతి - గుణవతి - రఘుకులజునిసతి - కనుగొనినారా - మీ రెరుక -
అసలుచునేయెడ నిడుములు గుడుచుచు - నుండెనో చెప్పుడీ - యొట్టునుడీ॥ సు॥

21 లక్ష్మణుడు—బ్యాగ్, త్రిశ్రగతి.

తెలిసె - తెలసె - తులువతనము - గెడపెదనిలురాకుమతీ॥ తె॥
దశరథసుతులనగ దుర్బలులటంచు నెంచితో॥ తె॥ [పేర్]
ఓ రాజ్యాంధకార గర్వచిత్తా - మోహాంధకార మత్తచిత్తా [మిశ్ర]
చూడుమా - శరవహ్నిచే - నిను హతమొనరింతురా - కనరా॥ తె॥

22 ఆంజనేయుడు— ఝంఝూటి, చతురశ్రి.

రామ రామ - సీతారామా - రామ శ్రీరామా॥ రా॥
సాగరంబు దాటనుంటి శుభము లొసగుమా॥ రా॥
దాసపోష - పుణ్యపురుష - సత్యభాషణా - నీకృపావలో కనమున
నాకుమోరామా॥ రా॥

23 లక్ష్మణుడు—హంసధ్వని, ఆది.

ప॥ ఛీ! ఛీ! వెన్నె - యక నిలుమా॥
అ॥ ప॥ మగటిమి - గలిగిన - తెగవది - రకనిరక॥ ఛీ॥
మునిగణంబులను - సనిమిషాదులను
దునిమిన నీపొగ - రణగింతునిరక
దనుజలోకమిపుడే - దహించెదరక
క్షణమున నని మొన - కనుగొను కుటిలుడ॥ ఛీ

24 ఇంద్రజిత్తు—కాఫీ—చతురశ్రి, ఏకతాళం.

చాల్! చాల్! పరుగిడరా!
సమరతలమునను - స్వర్గముజూడక॥ చా॥
అడవుల నాకల - ములు దిని బ్రతికెడి
వ్యర్థుండవునధ - మాధముండవు
తోడయుక వచ్చిన - దారినిబోవక
కళ్లన నిలిచిన - కడతేర్చెదనిద॥ చా॥

25 రాముడు—హిందుస్థానితోడి—చతురశ్ర, ఏకతాళం

ప॥ ఓయనుజా - అసురభీకరాజా!

అ॥ ప॥ అఖిలలోకపవిత్రా - హా సుమిత్రా సుపుత్రా!

చ॥ హా సుకుమారా - రణజితవీరా - వీరగభీరా - మూర్ఛిలితో రా॥ ఓ॥
యినకులచంద్రా! సద్గుణసాంద్రా! దనుజ విజితేంద్రా!
మనుజదేవేంద్రా!॥ ఓ॥

26 రాముడు—కాఫీ, త్రిపుట.

రాము—ఎంతయు శుభములనిటుమా - కిచ్చుచున్న యట్టి నిన్నెంతయు నుతి -
యించిననే - మిచ్చినదని యింతునే॥ నె॥

ఆంజ— దేవభవచ్చరణరా - జీవములకు దాసుడన్
దేవరకార్యము లొనర్చు - కేవిధి నాకెప్పుడున్॥ దే॥

రాము—దైత్యకులా నీకభిదా - తమ్మునిగుర్తుపోషితా
నిత్యోదయమాకారా - నీచేతల నల్పమా॥ నెం॥

ఆంజ— రామ! గుణ, స్తోమ! పరం, ధామ! ఘన - శ్యామ! శ్రీ
రామా జగదభిరామా - రామ రాక్షసవిరామ!॥ రా॥

27 రావణుడు—బ్యాన్, తితాల్.

నాధైర్యమును నాసాహసమున్ - నారణకౌశలమున్ - లోకంబెంతయు
కల్లోలముగా రూపుమాపజేయునుగా॥ నా॥
హరిహరాదులను - సురనరులనైనను - రణమునందున్ మదగణింతున్॥ నా॥

28 రాముడు—బ్యాగ్, చతురశ్ర.

ఓయధముడ! యిటు - లేల వదర నన్నెవడని తలచితివో - నీమది॥ నో॥
దానవవంశ - ధ్వంసునితోనా - తీకొనగా నాయువు సరిగా - నాకవిరోధీ!
యీదాశరథీ చాపమునంబలి యయ్యెద విడుగో॥ నో॥

29 భరతవాక్యము—బ్యాగ్, చతురశ్ర.

నిగమ వినుతచరితా మంగళముగు॥ విశ్వజనానందిత నమోనమః॥ ని॥
త్రిభువనబలరిపు రావణ దశవదనములను దుంచి జగన్నుతిగాంచితివి-
సురల నరులనతి - శోభిలజేసితి - నహాహ భువనములు మనిచితివయ్యా
కౌసలేయసుత విశ్రుత చరితా॥ ని॥

సంపూర్ణము.

ఆంధ్ర నాటకములు.

| | | |
|---|---|---|
| శ్రీరామోద్యోగము | 0 | 8 |
| శ్రీరామవిజయము | 0 | 8 |
| శ్రీరామాశ్వమేధము | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారము | 0 | 12 |
| కనక తార | 0 | 12 |
| శ్రీనివాస కల్యాణము | 0 | 8 |
| లంకాదహనము | 0 | 10 |
| పాదుకా పట్టాభిషేకం | 0 | 12 |
| శతకంఠ రామాయణం | 0 | 12 |
| వేశ్యా మధురం పా 1 | 1 | 0 |
| డిటో పా 2 | 0 | 12 |
| డిటో పా 3 | 0 | 8 |
| వేశ్యాహిత బోధిని | 1 | 0 |
| చతుర చంద్రహాస | 0 | 8 |
| ఆంధ్రపతాకము | 0 | 12 |
| ద్రౌపదీ పరిణయము | 0 | 12 |
| సంగీత సారంగధర | 0 | 12 |
| ఉషాపరిణయము | 0 | 8 |
| విజయబొబ్బిలి | 0 | 12 |
| సంగీత శశిరేఖ | 0 | 12 |
| సావిత్రి | 0 | 12 |
| జయంత జయపాలం | 0 | 8 |
| వైదర్భీవిలాసము | 0 | 12 |
| ప్రమీలార్జునీయము. | 0 | 6 |
| హనుమద్రామ సంగ్రామం | 0 | 10 |
| శమంత పంచకము | 0 | 8 |
| సుశీల నాటకము | 0 | 8 |
| పీష్వానారాయణరావు | 0 | 8 |
| సతీతులసి | 1 | 0 |
| రసపుత్రవిజయం | 0 | 12 |

ఆంధ్ర నాటకములు.

| | | |
|---|---|---|
| హస్తినాపురము | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసం | 0 | 8 |
| ప్రతాపసింహ కో॥ చి॥ | 1 | 0 |
| మంగతాయి కా॥ బ్ర॥ | 1 | 0 |
| శంబుకవధ త్రి॥ రా॥ | 0 | 12 |
| కురుక్షేత్ర సంగ్రామం | 1 | 0 |
| తపతీ సంవరణం కా॥ కొం॥ | 1 | 0 |
| సంపూర్ణ భారతం పిం॥ స॥ | 1 | 4 |
| సుమతీదేవి బ॥ కో॥ | 0 | 12 |
| అర్జున ప్రతిజ్ఞ ప్ర॥ వేం॥ | 0 | 12 |
| భీమ ప్రతిజ్ఞ క॥ కో॥ | 0 | 12 |
| ద్రోణ ప్రతిజ్ఞ జా॥ మృ॥ | 0 | 12 |
| అనసూయ శొం॥ గం॥ | 0 | 12 |
| రసపుత్రకదనము కొం॥ ల॥ | 1 | 0 |
| ప్రభావతీ ప్రద్యుమ్నం సూ॥ వేం॥ | 1 | 0 |
| సతీ సంయుక్త బా॥ వేం॥ | 1 | 0 |
| సువర్ణపాత్ర రా॥ నా॥ | 1 | 0 |
| సంస్కారిణి దా॥ పుం॥ | 1 | 0 |
| రుక్మిణీ పరిణయం గం॥ సీ॥ | 1 | 0 |
| మాళవిక ము॥ చం॥ | 0 | 12 |
| కనకతార డిటో | 0 | 12 |
| భక్తతుకారాము త్యా॥ వేం॥ | 0 | 12 |
| ననేమిర డిటో | 0 | 12 |
| శ్రీరామ నిర్యాణం బా॥ శ॥ | 0 | 8 |
| బుద్ధనాటకము | 0 | 8 |
| తారాబాయి దే॥ తి॥ | 0 | 12 |
| మారుతివిజయం కో॥ పుం॥ | 0 | 12 |
| వరవిక్రయం అ॥ నా॥ | 1 | 0 |
| కృష్ణసంజయ రాయబారం పె॥ వీ॥ | 0 | 12 |

వలయువారు :— కురుకూరి సుబ్బారావు,

**సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.**

## ఆంధ్ర [illegible]లు.

| | | |
|---|---|---|
| హరిశ్చంద్ర [illegible] | | |
| [illegible] | 0 | 12 |
| [illegible] పం॥ శే॥ | 1 | 0 |
| రామరావణ సంగ్రామం ప॥య॥ | 1 | 0 |
| [illegible] చంద్రహాస అ॥ వీ॥ | 0 | 8 |
| [illegible] సాయకము అ॥ అ॥ | 0 | 8 |
| వృద్ధవివాహం గో॥ వేం॥ | 0 | 12 |
| రాధాకృష్ణ లీల క॥ వేం॥ | 0 | 12 |
| శ్రీమతీదేవి శ్రీ॥ త్రి॥ | 1 | 0 |
| [illegible] | 0 | 12 |
| [illegible]మాధవ [illegible] సు॥ | 0 | 12 |
| సంపూర్ణరామాయణం మ॥గో॥ | 1 | 0 |
| సీతారామ వియోగము | 0 | 12 |
| మాలతీమధుకరం బ॥ స్వా॥ | 1 | 0 |
| సీమంతిని ము॥ చం॥ | 0 | 12 |
| [illegible] కో॥ సూ॥ | 0 | 8 |
| [illegible]జయంతీ విలాసం మ॥ శే॥ | 0 | 12 |
| [illegible] వ॥ ప॥ | 1 | 0 |
| [illegible] పె॥ వీ॥ | 1 | 0 |
| బుద్ధమత్ర్యవిలాసం [illegible] | 0 | 12 |
| ఘోరకలి గ॥ సు॥ | 0 | 12 |
| సంగీతవిష్ణులీల మ॥ శ్రీ॥ | 1 | 0 |
| సంగీత సావిత్రి [illegible] | 1 | 0 |
| పురూరవశ్చక్రవర్తి రాం॥ జ॥ | 1 | 0 |
| సీతాకల్యాణం బ॥ సీ॥ | 0 | 8 |
| ఉత్తరరామచరిత్రం పం॥ సూ॥ | 0 | 12 |
| [illegible] డిటో | 0 | 12 |
| [illegible]రవిలాపము జో॥ వ్యా | 0 | 12 |
| [illegible] వేం॥ | 0 | 12 |

## [illegible] నాటకములు.

| | | |
|---|---|---|
| రాణా ప్రతాప్ | 1 | 0 |

### డిటెక్టివ్ నవలలు.

| | | |
|---|---|---|
| ప్రతిజ్ఞా పాలనము | 1 | 8 |
| జయాపజయములు | 1 | 8 |
| భూతగృహము పా 1 | 1 | 8 |
| భూతగృహము పా 2 | 1 | 8 |
| మరకత మంజూష | 1 | 8 |
| రహస్య గోపనము | 1 | 8 |
| మాయావి | 1 | 8 |
| మనోరమ | 1 | 8 |
| మాయావిని | 0 | 12 |
| లక్ష రూపాయిలు | 0 | 12 |
| జీవన్మృత రహస్యము | 1 | 8 |
| సమాన ప్రతిభ | 1 | 8 |
| ఘోరకలి | 1 | 0 |
| గజదొంగ | 0 | 12 |
| బంగారు బరిణె పా 1 | 1 | 0 |
| బంగారు బరిణె పా 2 | 1 | 0 |
| కాలసర్పము | 1 | 0 |
| పాతాళ గృహము | 1 | 0 |
| వసుంధర | 1 | 0 |
| పేటికాంతర శవము | 1 | 0 |
| వలపులరాణి | 1 | 0 |
| హంతకుడెవడు | 0 | 8 |
| హత్యా విచారము | 0 | 6 |
| దొంగరాముడు | 0 | 12 |
| బుగ్గిరాముడు | 0 | 8 |
| అగ్గిరాముడు | 0 | 8 |
| బతేరాముడు | 0 | 8 |
| సీవేనా | 0 | 12 |

దొరకు స్థలము:— [illegible] రావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.